# మొల్లరామాయణము

ఇయ్యది
ఆతుకూరి మొల్లచే
రచియింపఁబడినది



ప్రకాశకులు
కె. జి. క్రిష్ణా బ్రదర్సు
గౌతమీ బుక్కుడిపో
రాజమండ్రి




దేశబంధు ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.
రాజమహేంద్రవరము.
1929

కాపీరైటు]

వెల 0—12—0

అభిమాన పోషకులు

మ॥ రా॥ శ్రీ నూకా సుబ్బరాజుగారు

గూటాల

శ్రీరస్తు.

# మొల్లరామాయణము

## బాలకాండము.





శ్రీమహిమాభిరాముఁడు వసిష్ఠమహామునిపూజితుండు సు
త్రామవధూకళాభరణరక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వాదళసన్నిభాంగుఁడు మహాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలమున్.

ఉ. శ్రీనగమందిరుం డమరసేవితుఁ డర్ధశశాంకమౌళి స
న్మానితపావపయోజదినాయకుఁ డబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్నుఁ డతినమ్యుఁడు శేషవిభూషణుండు వి
ద్యానిధి మల్లికార్జునుఁడు తా నిడు మాకు శుభంబు లొప్పఁగన్. 2

ఉ. తెల్లనిపుండరీకముల తేజము నొచ్చని కన్నుదోయితో
నల్లశిక్రీనిలరుచి నవ్వెడు చక్కనిదేహకాంతితో
నల్లనఁ బిల్లఁగ్రోవి కరమందలిసంజ్ఞల నింపు నింపగా
గొల్లతలన్ విరాళి తగఁ గొల్పెడు కృష్ణుఁడు ప్రోచుఁగావుతన్. 3

ఉ. మించి సమస్తలోకములు మిన్నక తాఁ బనవేర్పు సృష్టి ని
ర్మించి ప్రగల్భతన్ మెఱసి మేలును గీడును ప్రాణికోట్లు సే
యించ ఘటించి శాస్త్రములు వేదములుం గొనియాడుచుండు నా
కాంచనగర్భుఁ డిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్. 4

సీ. చంద్రఖండకలాపుఁ జారువామనరూపుఁ, గలితచంచలకర్ణుఁ గుండలకర్ణు
మోదకోజ్జ్వలబాహు మూషకోత్తమవాహు, భద్రేభవదను సద్భక్తసదను
సమ్మునిస్తుతిపాత్రు శైలరాడ్దౌహిత్రు, నానావిధామోదు విద్యాప్రసాదుఁ
బరమవరాభ్యాసుఁ బాశాంకుశోల్లాసు, నురుతరఖ్యాతు నాగోపవీతు

గీ. లోకవందితగుణవంతు నేకదంతు, నతులహేరంబు సత్కరుణావలంబు
విమలరవికోటితేజు శ్రీవిఘ్నరాజుఁ, బ్రథితవాక్ప్రౌఢికై యెప్డుఁ బ్రస్తుతింతు.

చ. కరిముఖుఁడుం గుమారుఁడు వికారపుఁజేఁతల ముద్దుగాఁపుచున్
గురుఫలుపాటుచు న్నగగుట్టలుదాఁటుచుఁ జన్నుదోయితోఁ
శిరసులు రాయుచుం గబ్బఁ జేర్చినఁ దండ్రినిఁ బట్టితీయఁగాఁ
గరములఁ జాఁప నవ్విభుజగమ్ముల తల్లి సుఖంబు లీవుతన్. 6

ఉ. సామజయుగ్మ మింపలరఁ జల్లనినీరు పసిండికుండలన్
వేడుక వంచిపంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ
దామరపువ్వుగద్దియ ముకంబున నుండెడిలోకమాత మా
కామునితల్లి సంపద లఖండముగా నిడు మాకు నెప్పుడున్. 7

ఉ. మేలిమిమంచుకొండ నుపమింపఁగ జాలినయంచ నెక్కి వా
హ్యాళి నటించి వచ్చుచతురాస్యు నెదుర్కొని నవ్వు దేరఁగా
వాలికసోగకన్నుల నివాళి యొనర్చి ముకుంబుఁగూర్చు వి
ద్యాలయ వాణి శబ్దముల నర్థములన్ సతతంబు మా కిడున్. 8

సీ. సుకవిసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి నఖిలవేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకారప్రభావవిభారవి, సత్కాంతిహిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్వితవిఖ్యాతి భవభూతిఁ, బ్రకటకావ్యధురీణు భట్టబాణు
మానినీలోకసమ్మదభద్రు శ్రీభద్రుఁ, గవితారసోల్లాసుఁ గాళిదాసు

గీ. స్తుత్యగుణోద్దాము నాచనసోము భీము, నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ, దిక్కకవిరాజును నుతించి ధీరిమించి 9

క. తొల్లిటిముప్పదిసత్కవి, పల్లవులను రసికవినుతవాగ్వైభవకళా
వల్లులఁ గవితారచనల, బల్లిదు లైనట్టిసుకవుల భక్తిఁ దలఁతున్. 10

క. గురులింగజంగమార్చన. పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
గురుఁ డాతుకూరికేసయ, వరపుత్త్రిని మొల్ల యనఁగ వఱలినదానన్. 11

సీ. దేశీయపదములు దెనుఁగులు సాంస్కృతుల్, సంధులు ప్రాజ్ఞులశబ్దపతతి
శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు, లాయాసమాసంబు లక్షరములను
భావార్థములుఁ గావ్యపరిపాకములు రస, భావచమత్కృతుల్ పలుకుసరవి
బహువర్ణములును విభక్తులు ధాతుల, లంకృతిచ్ఛందోవిలక్షణములుఁ

గీ. కావ్యసంపద క్రియలు నిఘంటువులును, గ్రమము లేనియు నెఱుఁగ విఖ్యాతగోప
వరపుత్రికంఠమల్లేను వరముచేత, తెలుఁగ కవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి. 12

క. చెప్పు మని రామచంద్రుఁడు, సెప్పించినపలుకుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన, మిప్పుణ్యచరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్. 13

వ. అని మఱియును. 14

చ. వలిపపుసన్న పయ్యెదను వాసిగ గప్పు బిగుత్తలోత్తమల్
గొలఁదిగఁ గానవచ్చుచనిగుబ్బచనుంగవలీల నొప్పఁగాఁ
దెలుఁగని చెప్పజోటఁ గడుతేఁటలమాటలఁ గ్రొత్తగీతులం
బొలుపు వహింపకున్న మఱి పొం దగునే పరహారిబ్ధుసుక్. 15

క. మును సంస్కృతముం జేటఁగఁ, దెనిఁగించెడిచోట నేను దెలియక యుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మర, ఘన మగుసంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే. 16

గీ. తేనె సోఁక నోరు తీయన యగురీతి, తోడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చినకావ్యమ్ము, మూఁగచెవిటివారి ముచ్చ టగును. 17

క. కందువమాటలు సామెత, లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకుం
బొందై రుచియై వీనుల, విందై మఱి కానిపించు విబుధులమదికిన్. 18

వ. అని మఱియును. 19

క. అది రఘురామచరితము, నాదరముగ విన్నఁ గ్రొత్తయై లక్షణసం
పాదమ్మై పుణ్యస్థితి, వేదమ్మై తోఁచకున్న వెఱ్ఱిసె చెప్పన్. 20

ఉ. రాజితకీర్తిదైన రఘురామచరిత్రము మున్ గవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పి రని తెప్పియుఁ గ్రమ్మరఁ జెప్పనే లనన్
భూజనకల్పకం బగుచు భుక్తికిముక్తికి మూల మైనయా
రాజును దైవ మైనరఘురాము నుతించినఁ దప్పు గల్గునే. 21

క. వారాంగన శ్రీరాముని, పే రిడి రాచిలుకఁ బిలిచి పెంపు వహించెన్
నేరుపు గలచందంబున, నారాముని వినుతిసేయ హర్షము రాదే. 22

క, నేరిచి పొగడినవారిని, నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గారణ మగుటకు భక్తియె, కారణ మగుఁగాని చదువు కారణ మగునే 23

ఉ. సల్లలితప్రతాపగుణసాగరుఁ డై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁ డైనరామనరపాలకునిన్ స్తుతి సేయ జిహ్వకున్

జిల్లరం బలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే
నల్లము బెల్లముం దినుచు నప్పటికప్పటి కాస సేయునే 24

వ. అని విత్కరించి మదంబున శిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రస్తుతియునుం
జేసి నా చేయం బూనిన మొల్లరామాయణమునకుఁ గథావిధానం బెట్టిదనిన. 25

సీ. సరయూనదీతీరసతతసన్మంగళ, ప్రాభవోన్నతమహావైభవమ్ము
కనకగోపురహర్మ్య ఘనకవాటోజ్జ్వల, త్ప్రాకారగోపురశ్రీకమ్ము
గజవాజిరథభటగణికాప్రచురచామరకేతుతోరణమండితమ్ము
ధరణీశఘోటికాభరణవిభ్రమరేఖ, దరసించుమాణిక్యదర్పణమ్ము
గీ. భానుకులదీపరాజన్యపట్టభద్ర, భాసినవరత్నఖచితసింహాసనమ్ము
వాఁగనుతికెక్కుమహిమ ననారతమ్ము, ధర్మనిలయమ్ము మహినయోధ్యాపురమ్ము. 26

సీ. మదనాగయూథసమగ్రదేశము గాని, కుటిలవర్తనశేషకులము గాదు
ఆహవోర్వీజయహరినివాసము గాని, కీశసముత్కరాంకితము గాదు
సుందరస్యందనమందిరం బగుఁ గాని, సంతతమంజులాశ్రయము గాదు
మోహనగణికాసమూహగేయము గాని, యూథికానికరసంయుతము గాదు
గీ. సరససత్పుణ్యజననివాసమ్ము గాని, కఠిననిర్దయదైత్యసంఘంబు గాదు
కాదు కాదని కొనియాడఁ గలిగినట్టి, నృపవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము 27

సీ. భూరివిద్యాప్రౌఢి శారదాపీఠమై, గణుతింప సత్యలోకమ్ము వోలె
మహనీయగుణసర్వమంగళావాసమై, పొగ డొందు కైలాసనగము వోల
లలితసంపచ్చాలిలక్ష్మీనివాసమై, యురవైనవైకుంఠపురము వోలె
విరచితప్రఖ్యాతహరిచందనాఢ్యమై, యారూఢి నమరాలయమ్ము వోలె
గీ. రాజరాజనివాసమై తేజరిల్లి, నరవరోత్తరదిగ్భాగనగరి వోలె
సకలజనములు గొనియాడ జగములందు, బొలుపు మీరెను సాకేతపురవరమ్ము 28

క. ఇమ్ముల నప్పుర వప్రము, కొమ్ములపై నుండి పురముకొమ్మలు వేడ్కన్
దమ్ములచుట్టముపజ్జల, జమ్ములు పూజింతు రొగి నజస్రము ప్రీతిన్. 29

క. పరువున మురువై యుండును, సురపురమునఁ గల్పతరులు చూపఱకింపై
పరువున మురువై యుండును, దురగంబు లయోధ్యఁ గలప్రతోలికలందున్. 30

క. దానగుణమ్మన సురపురి, సేనాఁడును నమరరత్న మెన్నిక కెక్కున్
దానగుణంబున మిక్కిలి, యేనుఁగు లాపురములోన నెన్నిక కెక్కున్. 31

క. కవిగురుబుధమిత్రాదులు, వివిధార్చనల నమరపురి వెలయుదు రెలమిన్
గవిగురుబుధమిత్రాదులు, వివిధార్చనల నమరఁ బురి వెలయుదు రెపుడున్. 32

క. భోగానురాగసంపద, భోగులు ప్రస్తాంతరంబు భూయుతలీలన్
భోగానురాగసంపద, భోగులు ప్రస్తాంతరంబు భూయుతలీలన్. 33

సీ. ప్రకటానురాగసంపన్ను లౌదురు గాని, రమణీయపద్మాకరములు గారు
శుభపత్రోజ్జ్వలసూత్రధారులు గాని, టక్కరిహాస్యవాదులు గారు
ఉభయసంధ్యావిధివ్యక్తకర్ములు గాని, చప్పుడఁగా నిశాచరులు గారు
తిలకించిచూడ సద్ద్విజులౌదురే కాని, తలఁపంగఁ బక్షిజాతములు గారు
గీ. బాడబులు గాని యగ్నిరూపములు గారు, పండితులు గాని విజ్ఞులపగిదిఁ గారు
ధీవరులు గాని జాతినిందితులు గారు, పరమపావను లాపురి ధరణిసురులు. 3

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారు లందఱున్. 35

సీ. తగదానవిఖ్యాతి ధరఁ గుబేరులు గాని, సతతాంగకుష్ఠపీడితులు గారు
నిర్మలసత్యోక్తి ధర్మసూనులు గాని, చర్చింప నన్యాకభాషకులు గారు
ప్రకటవిభూతి సౌభాగ్యరుద్రులు గాని, వసుధ వైరోషమూర్ధకులు గారు
కమనీయ గాంభీర్యఘనసముద్రులు గాని, యతులితభంగసంగతులు గారు
గీ. వర్తకులు గాని పక్షులు లేవరుసఁ గారు, భోగులే కాని పాము లెప్పుడును గారు
సరసులే కాని కొలఁకులజాడఁగారు, పన్నె కెక్కిన యప్పురి వైశ్యులెల్ల. 36

క. పంటల భాగ్యోదయులై, పంటలపైఁ బంటలమర బ్రతుకుదు రెపుడున్
బంటలుఁ బాడియు గలయా, పంటలు మొదలైన కాఁపుఁబ్రజ లానగరిన్. 37

సీ. కనికిమాపుల చేతఁ గరఁగింప నేర్తురు, బ్రహ్మచారులుల నైన భ్రాంతిగొలిపి
మృదువచోరచనల వదలింప నేర్తురు, ఘనమునీంద్రుల నైనఁ గచ్ఛదములు
వలపులు పైఁజల్లి వలపింప నేర్తురు, సన్న్యాసులను నైనఁ జలముపట్టి
సురతబంధమ్ములఁ జొక్కింప నేర్తురు, వ్రతములు వైకొన్న యతుల నైన
గీ. అచలు మెక్కింప నేరుతు రౌషధముల, మరులు గొలుపంగ నేర్తురు మంత్రములను
ధనములంకింప నేర్తురు తక్కునేసి, వాసి కెక్కిన యప్పురి వారసతులు. 38

సీ. శారదగాయత్రిశాండిల్యగాలవ, కపిలకౌశికులవిఖ్యాతి గలిగి
మదనవిష్వక్సేనమాధవనారద, శుకవైజయంతికాద్యులను గలిగి
చంద్రార్కగుహగిరిసంభవజయవృష, కుంభబాణాదులఁ గొమరుమిగిలి
సుమనరైరావతసురభిశక్రవృక్ష, పారిజాతముల సొంపారఁ గలిగి
గీ. బ్రహ్మనిలయమ్ము వైకుంఠపట్టణమ్ము, నాగకంకణుశైలమ్ము నాకపురము
లలితగతిఁబోలి యేవేళ దులనుదూఁగి, ఘనత నొప్పారు నప్పురివనములెల్ల. 39

చ. కనకవిలాసకుంభములు గబ్బిగుబ్బచంటిలీలఁ జిత్రకే
తనములు పైఁటకొంగులవిధంబునఁ గాలిగవాక్షము లక్షులన్
గనుఁగవయట్ల పొల్పెసఁగఁగా భువిభోగులు మెచ్చభోగినీ
జనములరీతిఁ జెల్వమరు సౌధనికాయము పాయకప్పురిన్. 40

తే. మకరకచ్ఛపశంఖపద్మములు గలిగి, ధనదునగరమ్ముపైఁ గాలు ద్రవ్యమందు
సరసమాధుర్యగాంభీర్యసరణిఁ జేర్చి, గుఱుతుమీఱినయప్పురికొలఁకులెల్ల. 41

తే. అమృతధారాప్రవాహమ్మునందు నెపుడు, నొక్కధేనువు దివినున్న నుచితమగునె
అమృతధారాప్రవాహమ్మునందు నెపుడు, జెక్కుధేనువు లప్పురిఁ జేరునొందు, 42

క. ఈకరణి సకలవిభవ, శ్రీకర మయి తాఁ బ్రసిద్ధిఁ జెలఁగుచు మహిమన్
నాకపురితోడ సరిదూఁచు, సాకేతపురమ్ము వేయు జగము నుతింపన్. 43

వ. అట్టిమహాపట్టణంబున కధీశ్వరుం డెట్టివాఁ డనఁగ. 44

సీ. తనకీర్తికర్పూరతతిచేత వాసించెఁ, బటుతరబ్రహ్మాండభాండమెల్లఁ
దనశౌర్యదీప్తిచే నినబింబ మనయంబుఁ, బటలెల్ల మాఁగుడువడఁగఁ జేసెఁ
ధనదానవిఖ్యాతి ననుదినంబును నర్థి. దారిద్ర్యయములు వెళ్ళఁ బాడిఁ దఱిమెఁ
దననీతిమహిమచే జనలోక మంతయుఁ, వగిలి సంతతమును బొగడఁ దనరె
గీ. భళిర! కొనియాఁడ బాత్రమై పరగినట్టి. వైరినృపజాలమేఘసమీరణుండు
దినకరాన్వయపాథోధి సజవైరి, సితకటాక్షియకకరుండు దశరథుండు. 45

సీ. పాలింపఁ డవినీతిపరుల మన్ననఁ జేసి, పాలించు సజ్జనప్రతతి నెపుడు
మనుపఁడెన్నఁడుఁ జోరులను గారవము జేసి, మనుచు నాశ్రితకోటి ఘనము గాఁగ
నెఱి పెఱుంగఁడు వైరికులఁ బొడగన్న, నెఱచు బొంకేయెడ దొరలునో యని
తలఁపఁ డర్థప్రాంతజులు మాఱిపైనన్న, పలుకు ధర్మ్రాబెంసఁ దప్పునో యని
గీ. సరవిఁబోషింపఁ డరిగణషట్కమెపుడు, వెలయఁ బోషించు నిత్యమ్ము విప్రవరుల
భాస్కరాన్వయతేజోవిభాసితుండు, ఘనసుధర్ముండు సకలసద్ధర్మపరుండు. 46

సీ. కనఁగోరఁ డొకనాఁడుఁ గన్నులఁ బరవధూ, లావణ్యసౌభాగ్యలక్షణములు
వినఁగోరఁ డొకనాఁడు వీనుల కింపుగాఁ, గొలుచువారలమీఁది కొండెములను
చిత్తంబు వెడలించి జిహ్వాగ్రమునఁ గోరి, పలుకఁడు కాఠిన్యభాషణములు
తలఁపఁ డించుకయైన ధనకాంక్ష నేనాఁడు, బంధుమిత్రాశ్రితప్రతతిఁ జేపప
గీ. సతతగాంభీర్యధైర్యభూషణపరుండు, వార్తకెక్కినరాజన్యవర్తనుండు
సకలభూపాలజనసభాసన్నుతుండు, ధర్మతాత్పర్యనిరతుండు దశరథుండు. 46

సీ. విరహాతిశయమున వృద్ధిఁ బొందఁగలేక, విషధరుఁడును గోర విషముఁ బూనె
తాపంబుకోర్వెంచి తరియింపనోపక, పలుమాఱుఁ గడగండ్లఁ బడియెఁ గరులు
కందర్పశరవృష్టికందనోపక ఘృష్టి, వనవాసమునఁ గ్రుస్సి వనరుసూపె
దీపించి వల పాన నోపక కూర్మంబు, కుక్షిలోపలఁ దలఁ గ్రుక్కికొనియె
గీ. కుంభిని కాంత తమమీఁది కూర్మి విడిచి, ప్రకటరాజన్యమస్తకాభరణమకుట
చారుమాణిక్యదీపితచరణుఁడైన, దశరథాధీశుభుజపీఠిఁ దగిలినంత.

క. ఆ రాజు రాజ్యమందలి, వారెల్లను నితరధర్మవర్తను లగుచున్
భూరివిభవంబుల, దారిద్ర్యం బెఱుఁగ రెట్టికఱి నేనాఁడున్. 49

వ. ఇట్టిమహాధైర్యసంపన్నుండును, మహైశ్వర్యధుర్యుండును నగు దశరథమహారాజు సకలసామంతరాజలోకపూజ్యమానుం డగుచుఁ బ్రాజ్యం బగురాజ్యంబు నేలుచు నొక్కనాఁడు.

సీ. సంతానవృద్ధికై చింతించి చింతించి, శిష్టవర్తనుఁ డౌవసిష్ఠుఁ జూచి
తనకోర్కి వినుతింప విని మునిసింహుండు, వలికె ఋశ్యశృంగు నెలమిఁ దేర
ఘనుఁ డాతఁ డొగిఁ బుత్రకామేష్టి యనుపేర యాగమ్ముఁ గారవింపనం పవలన
వినుతికెక్కఁగఁ జాలుతనయులు గలుగుట, సిద్ధమ్ము నామాట బుద్ధిలోన
గీ. నిలుపుమనిచెప్ప నారాజు నెమ్మితోడ, నకుటిలాత్ముఁడు నావిభాండకునితనయు
నెలమి రావించి పుత్రకామేష్టి యనెడి, జన్న మొనరించుచున్నట్టి సమయమునను.

ఉ. రావణుచేతిబాధల నిరంతరమున్ బడివేఁడి మూఁకలై
దేవతలెల్ల గీష్పతికిఁ జెల్లముగా నెఱిఁగింప [illegible] రా
జీవతనూజుఁ డున్నదను [illegible] చెప్ప నా
దేవుఁడు విష్ణుసన్నిధికి దిగ్గనఁ జేకొనిపోయి యచ్చటన్. 42

వ. ఆప్పురాణపురుషోత్తముం గాంచి నమస్కరించి యింద్రాదిదేవతలం జూపి బ్రహ్మ యిట్లని విన్నవించె. 53

క. రాముఁడు దనుజులతో సం, గ్రామము సేయంగఁ గలఁడె కందు గదా నే
చే మిమ్ముఁ గొలిచి వచ్చెద, నో మునిరాజేంద్ర యనఁగ ముచితప్రౌఢిన్. 72

మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి విను వయ్యా రాజ నీచేతఁగా
దనరారైనను రాక్షసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
ఘనుఁ డీరాముఁడు దక్క వారిఁ గెలువంగా రాదె చిన్నంచు నీ
వనుమానింపక పంపు మింకఁ గ్రతురక్షార్థంబు భూనాయకా. 73

వ. అని ప్రియోక్తులు పలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకులపవిత్రుం డైన దశర
థుండు మాఱాడ నోడి యప్పగించె. 74

క. మునినాథు వెంట సుత్రా, ముని నలజడి వెట్టుచున్న మూర్ఖులపై రా
ముని సౌమిత్రిని వెసన, మ్మునితో నానందవార్ధి మునుఁగుచుఁ బరికెన్. 75

మత్తకోకిలము.

వారిఁ దోడ్కొని కౌశికుం డటవచ్చునయ్యెడ ఘోరకాం
తారమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా
కార మొప్పఁగ నట్టహాసవికాస మేర్పడ రాఁగ నా
క్రూరరాక్షసిఁ జూచి యమ్మునికుంజరుం డొగి రామునిన్. 76

క. తాటక వచ్చిన దదిగో, నాటఁగ నాఁడు దని మేల మాడక నీ వీ
పాటి పడ నేయు మని తన, చాటున భయపడెడి రామచంద్రున కనియెన్. 77

వ. ఇట్లు చెప్పిన యామునిచంద్రునిపలుకు లాలించి రామచంద్రుండు తన యంతరం
గమ్మున నిట్లని వితర్కించె.

క. ఈయాఁడుదానిఁ జంపఁగ, నాయమ్మున కేమిగొప్ప నగరే వీరుల్
ఛీ యని రోయుచు నమ్ముని, నాయకుభయ మెఱిఁగి తనమనమ్మున నలుకన్. 79

క. వ్రేటు గొని రామచంద్రుఁడు, సూటిగ నొకదిట్టకోల సురలు నుతింపన్
ఘోటకసమవక్షస్థలఁ, దాటక నత్యుగ్రలీల ధరపైఁ గూల్చెన్. 80

వ. ఇట్లు తాటకం గీటణంచినయంత నమ్మునీంద్రుండు మేటిసంతోషమ్మున రామునిం
గొనియాడుచు నశ్రమంబుగ నిజాశ్రమంబున కేతెంచి రామసౌమిత్రుల సాయం
బున జన్నంబున సేయుచున్న సమయంబున. 81

క. ఆకాశవీధి నెలకొని, రాకాసులు గురిసి దమితరక్తము బలలం
బ కాఁకను యజ్ఞముపై, భీకరముగ మసిగణంబు భీతిం బొంకన్. 81

ఉ. అంబరవీథి నిల్చి త్రిదశాంగన లెంతయుఁ జేసి రత్నసూ
నంబులు గాధినందనుని జన్నము పైఁ గురియంగ నంతలో
నంబరరత్న వంశకలశాంబుధిచంద్రుఁడు రామచంద్రుఁడు
గ్రొంబుగఁ ద్రుంచెఁ జండబలగర్వులఁ దమ్ముఁడుఁ దాను సొక్కుచున్. 83

వ. ఇట్లు రామచంద్రుండు సాంద్రప్రతాపంబు మించ నిశాచరులఁ ద్రుంచిన నమ్మౌని
చంద్రుండు నిర్విఘ్నంబుగా జన్నంబు పూర్ణంబు చేసి రామసౌమిత్రులం గారవించె నట్టి
సమయమ్మున 84

క. ధరణీసుత యగుసీతను, బరిణయము నొనర్ప జనకపార్థివుఁ డిల భూ
వరసుతుల రందఱి స్వయం, వర మొగిఁ జాటించె నెల్లవారలు వినఁగన్. 85

వ. ఇట్లు స్వయంవరమహోత్సవఘోషంబున సంతోషమ్ము నొంది విశ్వామిత్రుండు
రామసౌమిత్రుల మిథిలానగరంబునకుఁ దోడ్కొని చనుచుండు మార్గంబున. 86

క. ముదితాపసి వెనువెంటను, వదలక చనుదెంచునట్టియెడ రామశ్రీ
పదరజము సోఁకి చిత్రం, బొదవఁగఁ గనుపట్టె నెదుట నొకయుపల మటన్. 87

క. పదనై యొప్పిద మైకము, గదలుచు బంగారుప్రూపె కరఁగినకరణిన్
బొదలుచు లావణ్యస్థితి, సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిరలీలన్. 88

ఉ. ఆమునివల్లభుండు గొనియాడుచుఁ బొడఁచు వేడ్కతోడ శ్రీ
రామునిఁ జూచి యిట్లనియె రామ భవత్పదపాళి సోఁకి యీ
భామిని రాయి మున్ను కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగువారలకు నమ్మఁగవచ్చును భుక్తిముక్తులున్. 89

వ. అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతయు సంతసమ్మున
నమ్మునిచంద్రనందనుల కెఱింగింపుచు మిథిలానగరంబునకుం జనియె నచ్చట. 90

సీ. ద్రవిడకర్ణాటాంధ్రయవనమహారాష్ట్ర, రాజకుమారులు తేజ మలరఁ
బాండ్యఘూర్జరలాటబర్బరకుళయాళ, భూపనందనులు విస్ఫూర్తి మీఱ
గౌళకేరళసింధుకాశకోసలసాళ్వ, ధరణీశపుత్త్రులు సిరి వెలుంగ
మగధమత్స్యకళింగమాళవనేపాళ, నృపతనూభవులు నెన్నికను నెక్క
గీ. మఱియు నుత్కలకొంకణమద్రపాండ్య, వత్సగాంధారసౌరాష్ట్రవంగచోళ
రాజ్యముల నొప్పుచున్న రాజసుతులు, వచ్చి రక్కామినీస్వయంవరమునకును. 91

ఉ. కొందఱు పల్లకీల నెఱకొందఱు తేరుల నందలంబులన్
గొందఱు కొంద ఱశ్వములఁ గొందఱు మత్తగజేంద్రసంఘమున్
గొందఱు స్వర్ణడోలికలఁ గోరిక నెక్కి నృపాలనందనుల్
సందడి గాఁగ వచ్చి భుజంబు భుజంబున ద్రోపులాడఁగన్. 92

వ. అట్టిసమయంబున. 93

చ. గురుభుజశక్తి గల్గుపదికోట్లజనంబులఁ బంప వారు నా
హరుశరాసనంబుఁ గొనితూఁగుచుఁ బాఁకుచుఁగొంచువచ్చి సు
స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన దానికి ధూపదీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పఁగన్. 94

వ. అట్టిసమయంబున జనకభూపాలుండు రాజకుమారులం గనుంగొని యిట్లనియె. 95

ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుం డిదె సత్యవాక్యమై
యింకను చేసినాఁడ విదితోజ్జ్వల మైనపణంబుఁ గాననీ
శంకరుచాప మెక్కిడిన సత్త్వధనుం డగువాని కిత్తు నీ
పంకజనేత్రి సీత నరపాలకులార నిజంబు సెప్పితిన్. 96

గీ. అనుచుఁ బలుకుచున్న యవనీశతిలకుని, వాక్యములకు నుబ్బి వసుధతీశ
సుతులు దాముతామె మతిలోనఁ జెలఁగుచుఁ దగ్గఱంగఁ బోయి ధనువుఁ జూచి.

క. విల్లా యిది కొండా యని, తల్లడపడి సంశయంబు దలకొన మదిలోఁ
బల్లిదు లగునృపనందను, లెల్లరు దౌదవ్వుల నుండి రెంతయు భీతిన్. 98

క. కొందఱు దగ్గఱ నోడిరి, కొందఱు సాహసము చేసి కోదండముతో
నందంద పెనఁగి పాఱిరి, సందుల గొందులను దూఱి సత్త్వము లేమిన్. 99

సీ. గాలిఁ దూలినరీతిగా నెత్తఁ జాలక, తముఁ దామె సిగ్గునఁ దలలు వంచి
కౌఁగలించిన లోను గాక వ్రేగ్గల మైన, భీతిచే విక్కిలి బెదరి పోయి
కరముల నందంద పొరలించి చూచినఁ, గదలక యున్నఁ జకాకుపడుచుఁ
బాషాణ మున్నట్టిసగిది మార్దవ మేమి, కాన రాకుండినఁ గళవళించి

గీ. రాజసూనులు కొంతలు తేజ ముడిగి, జగతిరాజుల మోసపుచ్చుంగఁ దలఁచి
జనకుఁ డీమాయఁ గావించెఁ జాలు ననుచు, దలఁగి పోయిరి దర్పగాఢము విడచి.

సీ. ఇది పర్వతాకార మీవిల్లు కను విచ్చి, తేఱి చూడఁగ రాదు దేవతలకు
నటు గాక ముదు శేషకటకుండైనను నంబ, హరుడె కావలెఁ గాక హరియుఁ గాక
తక్కినవారికిఁ దరమె యీకోదండ, మెత్తంగఁ జగుచేవ యెట్లు గలుగు
గ్రిందగ నేల దీని కోడఁగ నేల, పరులచే నవ్వులు పడఁగ నేల

గీ. గురుతు సేసి యుఁ దమలావు కొలఁదిఁ దామె, తెలియవలెఁ గాక యూరక తిరుగ నేల
యొరులసొమ్ములు తమకేల దొరకు ననుచుఁ, దలఁగి పోయిరి రాజనందనులు గనుచు.

వ. అంత విశ్వామిత్రమునీంద్రుండు రామచంద్రుని ముఖావలోకనంబుఁ జేసిన. 102

చ. కదలకుమీ ధరాతలమ కాశ్యపిఁ బట్టు ఫణీంద్ర భూవిహా
స్పదులను బట్టు కూర్మమ రసాతలభోగిఢులీకులీశులన్
వదలక పట్టు ఘృష్టిధరణీఫణికచ్ఛపపోత్రివర్గమున్
బొదవుచుఁ బట్టుఁడీ కరులు భూవరుఁ డీశుని చాప మెక్కిడున్. 103

క. ఉర్వీనందనకై రా, మోర్వీపతి యెక్కు నిడ్డ ముగురిచాపం
బుర్విం బట్టుఁడు దిగ్దం, త్యుర్వీధరకటిఫణీంద్రులారా గడిమన్. 104

వ. అనుచు లక్ష్మణుండు పలుకుచున్న సమయంబున. 105

మ. ఇనవంశోద్భవుఁ డైనరాఘవుఁడు భూమీశాత్మజుల్ వేడ్కతోఁ
దను వీక్షింప మునీశ్వరుం డలరఁ గోదండంబు చేనందిచి
వ్వన మోపెట్టి గుణంబు పట్టి పటుబాహాశక్తితోఁ దీసినన్
దునిఁగెన్ జాపము భూరిఘోషము గ వార్ధుల్ మ్రోయ నందంబునన్. 106

గీ. తనువు మఱిమిఱంత ధరణీశ సుతులు, శిరములెల్ల వంచి సిగ్గుపడిరి
సీత మేను పెంచె శ్రీరామచంద్రునిఁ, బొగడె నపుడు జనకభూమిపుండు. 107

వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వసంపదను మెచ్చి సంతోషించి జనకమహారాజు వివా
హంబు సేయువాఁడై రమ్మని దశరథేశ్వరుని పేట శుభలేఖలు వ్రాయించి పంపిన
దశరథమహారాజును నాశుభలేఖలం జదివించి సంతోషంబున నానందభాష్పంబు
లు గ్రమ్మ జేసి మంత్రిప్రవరుం డగు సుమంత్రుని బిలిపించి సుమంత్రా యిప్పు

మనమందఱమును బయలుదేరి మిథిలాపట్టణంబునకుం బోయి యట జనకమహారాజు నింట మన రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు వివాహమహోత్సవము జరుపవలయుం గావున వసిష్ఠాదిద్విజవర్యులను గౌసల్యాది కాంతాజనమ్మును నరుంధతి మొదలుగాఁ గలభూసురభార్యలను మఱియు సకలబంధుజనంబును రావించి బంగరు రథంబుల నిడికొని తోడ్కొని రమ్మని యంపిన నతండును మహాప్రసాదం బని తత్క్షణము నంతఃపురంబునకుం బోయి కౌసల్య కైక సుమిత్ర మొదలగు రాజకాంతలను వసిష్ఠాది ద్విజవరిష్ఠులను నరుంధతి మొదలుగా గల ముత్తైదువలను మిగిలిన సకల బంధుజనమ్మును రావించి యుక్తప్రకారంబుగాఁ గనకరథమ్ములపై నిడికొని దశరథ మహారాజుకడకుం గొనివచ్చిన యంత దశరథుండు పుత్రద్వయసహితమ్ముగ రథ మారోహించి సమస్తసేనాసమన్వితుం డగుచు వాద్యఘోషంబులు దశదిశలు నిండ నడచుచున్న సమయమ్మున నంతకుమున్ను జనకభూవల్లభుండు దశరథమహీపాలు నెదుర్కొని తోడితెచ్చి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధుల విధ్యుక్తంబుగాఁ బూజించి మానితంబుగఁ గానుకలొసంగి సకలసంపత్సంపూర్ణ మయిననివేశము గల్పించి యుండఁ బెండ్లినాఁటిని ఓడిఉంచె నంత నక్కడఁ గనకవికార మైన పీఠమ్ముపైఁ గూర్చున్న సమయంబున దేవా శుభముహూర్తం బాసన్న మగుచున్నది రమ్మని వసిష్ఠుండు సనుదేర నాతఁడు సరి రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు మంగళస్నానమ్ముఁ జేయించి నిర్మలాంబరాభరణంబు లొసంగి వేర్వేఱ నొక్క ముహూర్తమ్మునఁ దనకూఁతు సీతను శ్రీరామచంద్రునకును, దనతమ్ముఁడు కుశధ్వజునికూఁతు లగు మాండవ్యూర్మిళాశ్రుతకీర్తులను భరతలక్ష్మణశత్రుఘ్నులకును నిచ్చి వివాహముంజేసి తనప్రియతనయల కొక్కొకతెకు నూటేసి భద్రగజమ్ములను వేయేసితురంగంబులను బదివేలు దాసీజనమ్మును లక్షధేనువులను నరణంబులిచ్చి దశరథాదిరాజలోకమ్మునకు బహుమానమ్ముగా నవరత్నఖచితభూషణమ్ములును జీని చీనాంబరమ్ములును నొసంగి సుగంధద్రవ్యమ్ముల నర్పించి పూజించి యంపె నంత దశరథమహారాజు వ.అ) యయోధ్యాపట్టణంబునకు వచ్చుచుండఁగా నధ్య మార్గంబున. 108

ఆ. బరశురాముఁ డడ్డుపడి వచ్చి మీరెవ్వ రనిన మొలకనవ్వుతోడ
నేను దశరథుండ నితఁడు నాపుత్రుండు, రాముఁ డండ్రు పేరు క్షేమబలుఁడ. 199

వ. అని వినుపించినఁ గ్రోధావేశవశంవదుండై యప్పుడప్పరశురాముండు రాముం గనుంగొని యిట్లనియె. 110

క. రాముఁడ నేనై యుండఁగ, నామీఁద నొకండు గలిగెనా మఱి యోఁ గా
కేమాయె రణ మొనర్పఁగ, రామా రారమ్మటంచు రహిఁ బిలిచెఁ దగన్. 111

వ. పిలిచినతోడనే రామచంద్రుం డతని కిట్లనియె. 112

ఆ. బ్రాహ్మణుండ వందుఁ బరమపవిత్రుండ వదియుఁ గాక భార్గవాన్వయుండ
వైన నిన్నుఁ దొడరి యాహవస్థలమున. జగడమాడ నాకుఁ దగునె చెప్పుము. 113

వ. అనిన విని పరశురాముం డిట్లనియె. 114

ఉ. శస్త్రముఁ దాల్చినం దగునె సన్నుతికెక్కిన బ్రాహ్మణుండనన్
శాస్త్రము గాదు నాకెవరి సంగరభూమిని నిల్చినంతనే
శస్త్రముఖంబులన్ నృపులఁ జక్కఁగఁ జేయుదుఁ గాన నిప్పుడున్
శస్త్రము శాస్త్రముం గలవు సాహసవృత్తిని రమ్ము పోరఁగన్. 115

వ. అనిన రామచంద్రుం డిట్లనియె. 116

మ. విను మావంటినృపాలురైనఁ గలనన్ వీరత్వముం జూపఁగా
నన యోఁ గాక మహానుభావుఁడవు నిన్నాలంబులో మీఱఁగా
నెనయన్ ధర్మమె మాకుఁ జూడ మఱి నీ వేమన్న నీమాటకుం
గనలన్ మంచిది కాదు మాకెపుడు దోర్గర్వంబు మీపట్టునన్. 117

వ. అనిన విని యెంతయుసంతోషించి భార్గవరాముం డారఘురామునితో నిట్లనియె.

గీ. శివునిచివురుపల్లు శీఘ్రుండవై యానాఁడు, విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ
వలదు నేఁడు నాకు వశమైన యీచాప, మెక్కుపెట్టితివియు మింతె చాలు. 119

ఉ. రాముఁడు గీముం డంచును ధరాజను లెల్ల నుతింప దిట్టవై
భీమునిచాపమున్ విఱిచి ప్రేలెద వందుల కేమిగాని యీ
శ్రీమహిళేశుకార్ముకముఁ జేకొని యెక్కిడవేని నేఁడు నీ
తో మఱి పోరు సల్పి పడఁద్రోతు రణస్థలి నీశరీరమున్. 120

చ. అని తనచేతివిల్లు నృపులందఱుఁ జూడఁగ నందియీయ నా
ధనువును గూడి తేజముఁ బ్రతాపముఁ రాముఁడు జెందె నంతనే
జనవరుఁ డాశరాసనముఁ జక్కఁగ నెక్కిడి వాడిబాణముం
దునిడి యేదిలక్ష్యమనఁ ద్రోపలునూపినఁ ద్రుంచెఁ గ్రక్కునన్. 121

వ. ఇట్లు మహాప్రతాపంబునఁ దాపసుఁ ద్రుంచి యనర్గళప్రతాపమ్మున భార్గవరాము దోర్గర్వంబు నిర్గర్వంబు గావించి జయమ్ముఁ గైకొన్న కుమారుని గౌఁగలించుకొని దశరథుండు కుమారచతుష్టయమ్ముతో నయోధ్యానగరంబుఁ బ్రవేశించి సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున. 122

శా. పారావారగభీరుఁ డర్క ద్యుతిలసత్పద్మాప్తకీర్తి న్నిస్సా
స్తారోదారవిహారుఁ డర్క సుజనరక్షాదక్షుఁ డర్క
సాగారాచారవిచారుఁ డర్క మని గర్వోన్మత్తపాలసంహారుఁ డర్క
లేరీసాటి నృపాలకుల్ దశరథోర్వీనాథజంభారికిన్. 123

వ. అని కొనియాడఁ దగిన నృపాలశేఖరుండు ధర్మమార్గంబు నొక్కింతయేనిఁ దప్పకుండఁ రాజ్యంబు సేయుచుండె ననుట విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డట మీఁదికథావిధానం బెట్టి దని యడుగుటయుం. 123

క. జలజాక్ష ! భక్తవత్సల!, జలజాసనవినుత పాదజలజాత ! సుధా
జలజాశభవ్యమందిర, జలజాకరచారుహంస! జానకినాథా! 125

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధకవిత్వ జంగమార్చన వినోద
నిత్యశైవాచార సంపన్న సుజనవినుత ఆతుకూరి కేశవశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు బాలకాండము
సర్వము నేకాశ్వాసము.



శ్రీరస్తు.

# మొల్లరామాయణము

## అయోధ్యాకాండము.



కం. దర్పరూప! ఖండిత
కందర్పవిరోధిచాప ! కరుణాబ్ధీపా!
వందితశుభనామా ! ముని
సందోహస్తుత్యభూమ ! జానకీరామా!

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునికి నెఱిఁగించిన తెఱంగు వినిపించెద నాకర్ణింపుము. 2

సీ. తనసుమంత్రాది ప్రధానులతోఁ గూడి, సుఖగోష్ఠి నుండంగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ గురునితో దశరథధరణినాథుఁ
డనియె నీభూభార మంతయు నొక్కఁట, నేలితిఁ జాలచే యేక హేలి
నటుగాక పగతుర నవలీల గెల్చితి, నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడ
గీ. నింతచాలదె యాశకు నెంత కెంత, రామచంద్రునిధరణికి రాజు గాఁగ
మీఁదుసూడంగఁ బట్టంబు భూరిమహిమ, గట్టవలయును మంచిలగ్నమునఁ జెలఁగి 3

గీ. అనుచు గురునకుఁ జెప్పి తా నతనిసమ్మ, తమున సౌభాగ్యమంగళదివ్యసమితిఁ
గూర్చుఁడనుచును మంత్రులకును నెఱుంగఁ, జెప్పి శృంగారమొప్పుఁ జేయుఁడనియె.

వ. అట్టి సమయంబున. 5

గీ. పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథిఁ జరమదిక్కున కేఁగఁగా శ్రమముతోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయనరుగు, కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె

క. మేలిమి సంధ్యారాగము, ప్రాలిన చీఁకటియుఁ గలిసి వరుణునిపంకెన్
నీలముఁ గెంపును నతికిన, పోలికఁ జూపెట్టెనట నభోమణి తలఁగన్. 7

క. వారక కల్పద్రుమమునఁ, గోరకములుర పుట్టినట్లు గురుతరకాంతిన్
తారకములు తల సూపెన్, జోరానీకమ్ము మిగుల స్రుక్కుచునుండన్.

గీ. కారుమొగులరీతిఁ గాటుకచందాన, సీటిభాతి నింద్రనీలమహిమ
మాషరాశిపోల్కి మఱిపుటి యపు డంధ, కార మవనియెల్లఁ గలయఁబర్వె. 9

వ. అట్టిసమయంబున. 10

చ. తలవరులన్ నిజాధిపుల దర్పకునేర్పునఁ గన్నుఁ బ్రామి య
త్తలఁ దమపిన్నపాపల నుదారత నేర్పడ నిద్రపుచ్చి ని
ర్మలకరకంకణావళులు రట్టుగ దా మటు మ్రోఁగనీక వి
చ్చలవిడిగాఁ జరించి రోగి జారలతాంగులు మధ్యరాత్రులన్. 11

చ. సురతములేక యుస్సురనుజోటి మగం డుడికించు కాంతయున్
సరస మెఱుంగు చంద్రముఖి సావడిదంటయు జేరకత్తెయున్
బరపురుషాభిలాషమును బాయనిభామిని పోరుకట్టునన్
బరఁగినభామలాది యుపభర్తలఁ గూడి చరించి రత్తఱిన్. 12

ఉ. భానుసహస్రసత్కిరణపఙ్క్తుల నుద్భవ మైనయాబృహ
ద్భానుని వెట్టఁ జెల్లడకఁ బడ్డ సుధాంబుధిమీఁది మీఁగడల్
పూని సమీరుచేఁ దెరల పూర్వదిశం గనుపట్ట దానిపై
ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుకొండపైఁ దగన్ 13

చ. కుముదములుం జకోరములుఁ గోమలసస్యముఁ జంద్రకాంతముల్
రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసె జగంబు లుబ్బఁగాఁ
గమలములున్ వియోగు లధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్
రమణఁ గలంగ వెన్నెల తిరంబుగఁ గాచె జగంబు లుబ్బఁగాన్. 14

ఉ. నారదు లైరి సన్మునులు నాకమహీజము లయ్యె భూజముల్
శారద లైరి భామినులు శంకరశైలము లయ్యె గోత్రముల్
పారద మయ్యె నీరధులు పన్నగనాయకు లయ్యె నాగముల్
వారదవర్గ మెల్ల సితవర్ణము లయ్యెను బండువెన్నెలన్. 15

చ. శౌఁడు కుదయించెనం చలరి కోరి సుధాంబుధి మిన్ను ముట్టి య
ప్పుడు జగమెల్లఁ గప్పెననఁ బూర్ణతనొందెను సాంద్రచంద్రికల్

పుడమికిఁ బాలవెల్లిగతిఁ బొల్పెసలారఁగఁ జంద్రుఁ డొప్పె న
య్యుడుపతి మేనిమచ్చ యమునొప్పెఁ బయోనిధిపద్మనాభుఁడై. 16

వ. అట్టిసమయంబున. 17

ఉ. కాంచి చకోరదంపతులు గుంపులుగుంపులు గూడి రంతులన్
జేసిన చంద్రికారసముఁ జేర్కొని మార్కొని పొట్టనిండఁగాఁ
బారణసేసి పెన్బయలఁ బ్రాఁకుచు, జంచుపుటంబు లెత్తుచున్
జే ము వారుచుండె వడిఁ జేమజనింప పఘూటికోటికిన్. 18

చ. వెన్నెలతీఁగెలన్ గొనలు వేడుక ముక్కులఁ ద్రుంచి తెచ్చి దా
ర్కొన్న ప్రియాంగనాతతికిఁ గూరిమిఁ నోటికి నిచ్చి కేళికిన్
వన్నెపుఁగంఠనాళముల సన్నలు సేసి సుఖించె నింపుగన్
దిన్నని చంద్రకాంతమణి తిన్నెలమీఁదఁ జకోరదంపతుల్. 19

గీ. పాకశాసని సేవంతిబంతి దిక్కి, నెగుర వైచినకైవడి నేమి నెప్పఁ
బాండువర్ణంబుతోఁ బూర్వభాగమందు, సొంపు మీఱంగ వేగుఁజుక్క వొడిచె.

వ. అట్టి సమయంబున. 21

క. రవి యుదయించెను జనుఁడీ, దివియలు నక్షత్రసమితి తిమిరము శశియున్
బవ లేమిటి కని కీలిసి, కువలయమున గూళ్ళ గోళ్ళ గూయ మొదలిడెన్. 22

చ. పదలక పద్మరాగమణి పట్టినఁ గ్రాలఁగఁ బట్టి నేర్పు పెం
పొదవఁగఁ దూర్పుకొండపయి కొప్పఁగఁ దెచ్చి జగద్గురుండు దాఁ
ద్రిదశవరేణ్యుకట్టెదురఁ దేఁకువ నిల్పినదర్పణంబు నా
నుదయము నొందె భానుఁడు సముజ్జ్వలకోకనదప్రదీప్తుఁడన్. 23

వ. ఆరాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్లుగా మెలంగి యాతఁడు దన్ను మెచ్చ
నెఱింగి కైక యిట్లనియె. 24

గీ. వసుమతీశ నాకు వర మిచ్చి తప్పుట, తగవు గాదు మీకుఁ దలఁపులోన
మఱచినా రదేమొ మన్నించి తొల్లింటి, యీవు లీయవలయు నీక్షణంబ. 25

క. జననాథ నాకుమారుని, వినుఁడీ పట్టంబు గట్టి వేవేగను రా
ముని మునిగా ననుపుఁడు మఱి, వనమునఁ బదునాల్గేండ్లు వర్తింపంగన్. 26

వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుఁడు డిల్లపడి తల్లడిల్లుచు నుల్లంబు గలంగి
మనం గిడి యచ్చేడియ పలికిన పలుకులకు మాఱాడక నోడి మిన్నక యున్నసమ

యంబున సుమంత్రుం డేతెంచి స్వామీ రామచంద్రునిఁ బట్టంబు గట్ట సుము
హూర్తం బాసన్నం బయ్యెఁ గావున మిమ్ము నచ్చటికి విచ్చేయ నవధరింపుం డని
వసిష్ఠభగవానుండు విన్నవించు మని పంపెనని చెప్పిన విని కైక యిట్లనియె. 27

మ. అసిలో మున్ను నృపాలుచిత్తమున కే నాహ్లాదముం గూర్చి నా
తనయుం బట్టము గట్టి రాఘవునిఁ బద్నాలుగేండ్లు కాంతారమం
దునువ ద్రిల్లఁగఁ బంపఁగొన్నవరముల్ ద్రోయంగ రాదెంతయు
న్వనసీమన్ మునివృత్తియందుమనుఁడీ వైళంబ యారామునిన్. 28

క. అని పలుకు కైకపలుకులు, విని వేగము మఱలి వచ్చి విన్నదనంబున్
దనుక వసిష్ఠునితోడన్, వినుతింపఁ సుమంత్రుఁ డట్టివిధ మేర్పడఁగన్. 29

వ. అనిన విని వశిష్ఠాదిప్రముఖులును సుమంత్రాదిప్రధానజనంబులును సైన్యంబును
బరివారంబును ఖిన్నులై యున్న నాసన్న యెఱింగి రామచంద్రుండు రాజచిహ్నం
బులు త్యజించి జటావిభూతివల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై యున్నంత లక్ష్మణుం
డును భూపుత్రికయును దోడం జనుదేరఁ దల్లులకు నమస్కరించి వసిష్ఠానుమతం
బును నాశీర్వచనంబులుఁ గైకొని యాస్థానంబు వెలువడి యరణ్యంబున కరుగు
నప్పుడు పురజను లందఱును బురపురం బొక్కుచు దశరథమహారాజును దూషింపు
చుఁ గైకను నిందింపుచు మూఁకలై శోకింపుచుండ నది యంతయు విని దశరథుండు
పురోహితామాత్యబంధువర్గంబులతో శ్రీరామచంద్రుం డేగినత్రోవం జన్నంత నా
రాముఁడు దూరంబునన్ జనియె, దశరథుండును మరలి వచ్చి పుత్త్రశోకంబున
నాకపురంబునకుం జనియెఁ దదనంతరంబ.

గీ. చనుచు రాఘవుండు స్వర్ణదియొద్దను, గుహునిఁ గాంచి యతనిఁ గుస్తరించి
తడయ కోడఁ బెట్టి దాఁటింపు మనవుడు, నట్ల చేయఁ దలఁచి యాత్మలోన. 31

వ. సుడి గొని రాముపాదములు సోఁకినధూళి వహించి రాయియే
ర్పడ నొక కాంత యయ్యెనఁట పన్నగ నీతనిపాదరేణు వి
య్యెడ వడి నోడ సోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాముపదకంజయుగంబు భయమ్ము పెంపునన్. 32

వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీపాదంబుల నీటఁ గడిగి యోడపై నెక్కించి యమ్ము
వ్వర నవ్వలికి దాఁటించిన నాక్షణంబ. 33

ఉ. రాజకులావతంసుఁ డగు రాముఁడు తమ్ముఁడుఁ దాను నాభర
ద్వాజమహామునీంద్రపదవారిజముల్ గని మ్రొక్క నాతఁ డం
భోజహితాన్వయాబ్ధిపరిపూర్ణసుధాకరుఁ డైన రామునిం
బూజ లొనర్చి కందఫలమూలములన్ బరితృప్తిఁ జేసినన్. 34

వ. సంతసింపుచు నారాత్రి యచ్చట నివసించి మఱునాటిదిన మర్కోదయమ్మున. 35

ఆ. ముదముతోడఁ దమ్ము ముని భరద్వాజుండు, భక్తి ననుప రామభద్రుఁ డపుడు
చనియె భ్రాతృదారసహితుఁడై సన్మౌని, కూటమునకుఁ జిత్రకూటమునకు. 36

మ. ఘనుఁ డారాముఁడు చిత్రకూటమున నేడ్కం జేరి యున్నంతలో
నన దంతావళవాజిరత్నరథనానాయోధసంఘంబుతో
డ నమాత్యద్విజబంధువర్గములతోడం గూడి వాద్యంబులన్
జనుదెంచెన్ భరతుండు రాముకడకున్ సద్భక్తియేపారఁగన్. 37

సీ. చనుదెంచి రామునిచరణంబులకు మ్రొక్కి, కైకేయి చేసినకపటమునకు
నగరంబు విడిచి యీపగిది ఘోరారణ్య, మున కిట్లు రా నేల మునులపగిది
నది గాక మనతండ్రి యత్యంత మైనట్టి, పుత్రశోకంబునఁ బొక్కిపొక్కి
త్రిదశాలయమ్మున దేవేంద్రుఁ గనఁ బోయె, నని చెప్ప విని రాముఁ డంతలోన
గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న ధరణిసుతలఁ, గూడి దుఃఖించి దుఃఖించి కొంతపడికి
నాప్తవర్గంబుచే మాని నంతమీఁద, భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ. 38

గీ. రాజు లేకున్నచో మఱి రాష్ట్రమందుఁ, గార్యమెట్లౌను మీ రెఱుంగనిది గలదె
నేఁటిసమయానఁ బట్టంబు నిలుపుకొనఁగఁ, దిరిగి విచ్చేయుఁ డనుచు నాభరతుతోడ.

వ. శ్రీరామచంద్రుం డిట్లనియె. 40

చ. జనకుఁడు చేసినట్టిమితిఁ జక్కఁగఁ దీర్చి కడంక నేను వ
చ్చినగుఱిదాఁక భూతలముఁ జేకొని రాజ్యముఁ జేయుమాటగా
దనకు మటన్న నొల్ల నన నాతనికిం దనపాదుకాయుగం
బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగఁ బంపె సొంపుగన్. 41

వ. ఇట్లు భరతుని భరతాగ్రజుం డనునయించి మరలించి నాకలోకకవాటం బగుచిత్రకూటంబు కదలి సౌమిత్రి భూపుత్రులంగూడి పోవునెడ నటవీమధ్యంబున విరాఘుం డను దైత్యాధముం డపరాధంబుచేసి దిగ్గన డగ్గఱి జగతీతనూభవ నెత్తుకొని గగ

నమార్గంబున కేగిపోవునెడ వాడిబాణంబున వానికంఠంబును ద్రుంచి గారుడాస్త్రంబున మరల నొయ్యన జనకనందనం డించి భయంబు వాపి ప్రియంబు సూపి యొయ్య నొయ్యన నయ్యెడ నున్న యత్రిమహాముని యాశ్రమంబునకుం జని ఘనంబుగ నాఘనుండు సేయుం పూజలం గైకొని రామచంద్రుం డచ్చటిమునీంద్రులకు దైత్యులవలని భయంబు లేకుండ నభయం బిచ్చి మన్ననం గొన్నిదినంబు లాయా మునులయాశ్రమంబుల నిలుచుచు వార లనుప శరభాదిమృగోత్కరశరణ్యంబగు నరణ్యంబుఁ జొచ్చిపోయె నని చెప్పిన విని నారదుని వాల్మీకిమునీంద్రుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు. 42

క. జలజాక్ష భక్తవత్సల, జలజాసనవినుతపాదజలజాతసుధా
జలరాశిభవ్యమందిర, జలజాకరచారుహంస జానకినాథా. 43

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురులింగజంగమార్చనవినోదనిత్యశైవాచార సంపన్న సూరిజనవిధేయ తాతుకూరి కేసనసెట్టి తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ మహాకావ్యంబునం దయోధ్యాకాండము సర్వము నేకాశ్వాసము.





శ్రీరస్తు.

# మొల్ల రామాయణము

## అరణ్యకాండము.



నిరతధనుర్వేదా

మునినాథప్రియసతీసుపూజితపాదా

జనకాశ్రితగుణధామా

సనకాదిస్తవ్యనామ జానకిరామా.

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగు వినిపించెద, 2

చ. ఇతనికిఁ బాదచారితన మేటికివచ్చెనొ పట్టభద్రుఁ డీ
సతి నవరూపరేఖలను జక్కని దయ్యును నిట్టిముగ్ధకున్
బ్రతివసియించు టెట్లొ రతిరాజసమానుల వీరి నేల యీ
గతిఁ బడద్రోచె బ్రహ్మ యని కాంతురు చెంచెత లమ్మహాత్ములన్. 3

సీ. నడుపనేరనికొమ్మ యడుగులు పొక్కులై, శర్కరస్థలముల శ్రమముఁ జెంద
పీచిన చేతులవ్రేళ్లు నెత్తురు గ్రమ్మి, పాటమర్లు కెంపులపోల్కి. నమరె
వడిగాలి సుడివడి వాడిన లేదీఁగ, భాగంబునను మేనిచేవ తఱిగె
పూర్ణచంద్రుని కాంతి పున్నమవేకువఁ, గనుపట్టుగతి మోము కళల విడిచె

గీ. ధవుని నడుగడుగునకుఁ బైదండ గొనుచు, నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురు
బెదవు లెండఁగ నీడను సుడిల గొనుచు, మనసులోఁ జేవయూఁకఁగ జనెనువేగ 4.

వ, ఇట్లా సీతయు రాముండును సత్యబుషింబోని సౌమిత్రియునుఁ గతిపయప్రయాణంబుల
బంచవటికిం జని సంతోషభరితాంతరంగులై. 5

క. అచ్చటఁ గొన్నిదినంబులు, ముచ్చటపడి యుండఁదలఁచి మునిముఖ్యుల చే
మచ్చికఁ దమ్ముఁడుఁ దానును, గ్రచ్చఱ నొకపర్ణశాలఁ గావించి తగన్. 6

గీ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను, గొన్ని వాసరంబు లున్నవేళ
వికృతవేషధారి వేవేగ నటఁ జొప్ప, నాక యనెడి దైత్యనారి యోర్తు. 7

వ. రాముని గని ప్రేమాభిరామం బగుమనంబునఁ దన్నుఁ గామించి రమ్మనిన రామ
చంద్రుండు సౌమిత్రిం జూప నతడు మున్న మా యన్న నభిలషించుటం జేసి
నాకు దోషంబు గాన నీ వారామునికడకు మరలఁ జను మన్న నది యట్లు చేసిన
రామచంద్రుండును దిరుగ లక్ష్మణుం జూచినఁ గోపించి యారాక్షసి మనుజేంద్ర
సూనుల దండింపఁ దలంచిన నెఱింగి భవతానుజుండు దాని నాసికాకర్ణంబులు గోసి
వైచిన నది నెత్తురు జొత్తిల్లఁ బసిపాపయుంబోలి యేడ్చుచు ఖరదూషణాదిసోదరు
లకుం జెప్పిన వారు గనలి రాక్షణంబున. 8

క. పదునాల్గువేల దైత్యులు, మదమున సోదరులు గొల్వ మండుచు శూరా
స్పద మగురక్షనికరముతోఁ, గదనంబున రామకడకు ఖరుఁ డేతెంచెన్. 9

గీ. ఖరుఁడు వచ్చినట్టి కలకలం బాలించి, రాఘవుండు తనదు రమణి యొద్దఁ
దొలఁగ నుండ ననుజుఁ దోడుగాఁ గాపుంచి జెనకఁ గంశఁ గలని కేగి నిలిచె. 10

శా. ఆవేళన్ ఖరుఁ డుగ్రవృత్తి లయకాలాభీలఘోరాకృతిన్
దైవారన్ గజవాజిసంఘములతో దైత్యాళితో భూరిరో
షావిర్భూతమనస్కుఁడై నడిచె గర్వాగంధసంరంభుఁడై
దేవవ్రాతము భీతిఁబొంది తలఁగన్ దేజంబు సొంపారఁగన్. 11

వ. ఇట్లు ఖరుండు నడచి భయంకరంబుగా రణంబు సేయుసమయంబున 12

ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకరరౌద్రరసంబు కన్నులన్
నిప్పులు రాల్చుచున్ నెఱయ వేర్చిన లావున విచిత్రశస్త్రముల్
కుప్పలు గాఁగ నేయుచును గుంజరవాజిరథావళుల్ ధరన్
దప్పక కూల్చుచున్ రుధిరధారలఁ దేల్చె సురారిసంఘమున్. 13

వ. అట్టిసమయంబున. 14

క. కరితురగస్యందనములుఁ, బరివారముఁ దెగినఁ బిదపఁ బటురోషమునన్
గరకరపడుచును నెదిరిన, ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరునిశిరంబున్ 15

వ. త్రుంచినంగని తీవ్రంబుగా. 16

క. ఘోషించి రామచంద్రుని, దూషింపుచు వచ్చినట్టి దూషణు మీఁదన్
రోషించి సురలు కను సం, తోషింపఁగ వాని శిరముఁ ద్రుంచెఁ గడంకన్. 17

గీ. త్రిశిరుఁ, డంతఁ గనలి దివ్యాస్త్రసంపన్న, రాముమీఁదఁ జూపి రణ మొనర్చ
మూఁడుశరము లతఁడు మొదలించి యట వాని, మూఁడుతలలుఁ ద్రుంచె మొగ్గరమున.

వ. ఇట్లు ఖరాదిరాక్షసుల శిక్షించి విజయంబు గొని ధను వెక్కుడించి మరలి పర్ణశాలకే
తెంచి తమ్ముఁడును దానును సమ్మదంబునం గలసి యున్న సమయంబున. 19

చ. చేమున నంత శూర్పణఖ సయ్యన లంకకు నేగి రావణుం .
గొలువునఁ గాంచి మ్రొక్కి తనకున్ నృపసూనులు చేసినట్టి చేఁ
తలు వినుపించి వారు తమతండ్రియనుజ్ఞను వచ్చి కానలో
పలఁదిరుగాడుచందములుఁ బన్నుగ నేర్పడఁ జెప్పి పిమ్మటన్.

క. ఆరాముభార్యవిభ్రమ, మేరాజతనూజలందు నెఱుఁగమువినిమున్
ధారుణిలోపలఁ గామిను, లారమణికి సాటిఁ బోలరభినుతిఁ జేయన్.

సీ. కన్నులు గలువలో కాముబాణంబులో, తెలివిగా నింతికిఁ దెలియరాదు
పలుకులు కిన్నెరపలుకులో చిలుకల, పలుకులో నాతి కేర్పఱుపరాదు
అమృతాంశుబింబమో యద్దమో నెమ్మోము, తెంపుతో సరికి భావింపరాదు
కుచములు బంగరుకుండలో చక్రవా, కమ్ములో చెలి కెఱుఁగంగరాదు

గీ. కురులు నీలంబులో తేఁటిగుంపు లొక్కొ, కిఱుఁదు పులికంబొ మన్మథుపెండ్లియరుగొ
యనుచుఁ గొందఱు సంశయంబందుచుండ, వెలఁది యొప్పారులావణ్యవిభ్రమము

క. కలదో లేదో యనుచును, బలుమరు నెన్నడుముఁ జూచి పలుకుదు రితరుల్
బలిమో కలిమో యనుచును, బలుమఱు జఘనంబుఁ జూచి పలుకుదు రితరుల్. 23

సీ. షట్పదంబులపైకి సంపెంగపువ్వుల, జలజాతములపైకిఁ జందమామఁ
గిసలయంబులపైకి వెసఁ గలకంఠముల్, సింధురమ్ములపైకి సింహములను
దొండపండులపైకి దొడ్డరాచిలుకల, నలరుఁదూఁపులపైకి హంసపతతిఁ
బండువెన్నెలనిగ్గుపైకిఁ జకోరముల్, పవనంబుమీఁదికిఁ బాపఱేని

గీ. మరుఁడు వైరంబు చేసినమాడ్కి నలక, నాసికాకరాననచరణస్వనములు
వరపయోధరసూక్ష్మ వచనబాహు, గమనహాసాంఘ్రు లూర్వారు రమణి కమరె. 24

క. బంగారునీరు నిలుపక, బొంగారుచు నుండ నజుఁడు పోసినమాడ్కిన్
శృంగారమెల్ల నిలుపక, బొంగారుచు నుండఁ గరఁగి పోసినమాడ్కిన్. 25

వ. అట్టివయోరూపంబులను గనుపట్టునట్టి యక్కాంతారత్నంబు నీకు సిద్ధించెనేని నీవు
త్రిభువనంబులు విజయంబుచేసిన యంతకన్నను సంతసింతువన్నిని కామాశుగంబు

లందగిలి కామాంధుండయి కన్నులుగానక యన్నుకొని తన్నుఁదామఱచి యొడ్డోల
గంబు చాలించి పుష్పకంబను విమానరత్నంబునధిష్టించి మారీచుకడకుం జనిప్రా
ర్థించి నీవు కనకమృగంబవై జనస్థానంబునకుం జని దశరథనందనుండగు శ్రీరాముండు
న్న పర్ణశాలకడకుం బోయిన నతండు నిన్ను వెనుకొను నీవునతనినతిదూరంబుగాఁ
గొనిపోయి మాయంబైన నేను రాముని భార్యం గొనివత్తువనిన విని సమ్మతిలకమా
ఱుత్తరం బిచ్చిన రావణుం డుగ్రుండై మండిపడనంతం జాసన్న యెఱింగి కనకమృగ
రూపంబును దాల్చె నాక్షణంబున. 26

క. ఒడలెల్లను బంగారము, పొడలెల్లను రత్నసమితిఁ బోలిన మెఱుపుల్
నడలెల్ల నెఱపి మెలఁగెడు, కడలెల్ల విలాసరేఖ కళలం దొప్పెన్.
వ. ఇట్లు కనకమృగాకారంబులం గైకొని పర్ణశాల కడకుంబోయి మెలంగుచున్నప్పుడు.
క. కనియును వినియును నెఱుఁగను, కనకమృగం బనుచు వేడ్కఁ గడలుకొనంగన్
గనఁగ మృగం బద్భుత మిది, కనకమృగం బేమి సేయఁగలదో మీఁదన్. 29
వ. అని కనుఁగొన్న మునిజనంబులు మనంబులం దలంకునెడ నామృగంబును మృగ
నేత్రియగు ధాత్రీపుత్రి గని దాని నభిలషించిన నాసన్న యెఱింగి సౌమిత్రిని
భూమిజకుం దోడిడి శ్రీరామచంద్రుఁడు దానివెనుకొని చనుచున్న యవసరమ్మున.

సీ. తనుఁబట్ట నొయ్యన వెనుకొని చనుదెంచు, నిలఁజేనితలఁపుఁ దాఁ దెలిసి తెలిసి
చేరువ మెలఁగుచుఁ బూరిమేయుచు డాసి, మెల్లన యంతంత మెలఁగి మెలఁగి
తనసీడఁ గొని దానె దిగ్గన దాఁటి, భయమునఁ బరువెత్తి పఱచి పఱచి
యెదరైనఁ బోవక యెలయించి కనుఁగొన్న దరువుల నొయ్యన నొరసి యొరసి
గీ. చెవులు నిక్కించి చూచుచుఁ జెలఁగి చెలఁగి, పోవ రాముండు దవ్వఁగాఁ బోయిపోయి
యెలమి మాయామృగంబని యెఱిఁగి మదిని, దీని జంపుదు గా కని తెగువచేసి. 31
క. ఏచినకినుకను బలునా, రాచము సంధించి డాసి రాఘవుఁ, డామా
రీచుని దైత్యాధముఁ గుల నీచునిఁ గూలంగ నేసె నిర్జరు లలరన్. 32
వ. వాఁడునుం గూలునవ్వేళ "హా లక్ష్మణా!" యనురవంబుం జేసిన నాధ్వని విని
జనకనందన మనంబున నులికి లక్ష్మణుం బిలిచి మీయన్న కేమికీడు వాటిల్లెనో కాని
నిన్నుఁ దలంచె నీవునుం బోయి మీయన్న కుశలస్థితిం దెలిసికొని రమ్మనిన నతండు
తలంపక నామెతో యిట్లనియె. 33

ఉ. ఏమిటి కంతభీతి మది నీవగ తోఁచుట యేమి నీకు నో
భామిని రామునందు నొకభారము చెందదు చేఁదె నేనియున్
భూమి వడంకదే నభము వోరన మ్రోయదె వార్ధులింకవే
తామరసాప్తసోగ్రహతారక లెల్లను నేల డుల్లవే. 34

ఉ. అంతపనయ్యె నేని దనుజాతకు నంతకు మన్మథాంతకున్
బంతముమీఱఁగాఁగలఁచి పన్నగమర్త్యసురేంద్రలోకముల్
బంతులు గట్టి యూడ్చు రిపుభంజను రాముని గందకుండ న
క్పింతను నీకుఁ దెచ్చి మదిభీతిని బొందకుమమ్మ జానకీ. 35

వ. అని లక్ష్మణుండు పలికిన విని జనకరాజనందన కినిసి వినరాని మాటలందూలనాడిన
మనంబునం గందికుందుచు శ్రీరామచంద్రుండేగినమార్గంబుననచనియెనంతనిక్కడ.

క. సన్యాసి వేష మరలఁగ, నన్యాయము తలచుకొనుచు నసురేంద్రుఁడు దా
గన్యారత్నముఁ గని సా, జన్యమునన దీవన లిడె శాంతము దోఁపన్. 37

క. దీవించుడు మునియే యని, భావింపుచుఁ జేరవచ్చు భామిని నపుడా
రావణుఁడు రథము మీఁదికి, వేవేగమ తిగిచి గగనవీథిని జనియెన్. 38

వ. అయ్యవసరంబున. 39

ఆ. అసుర గొంచుఁ బోవ నవనీతసూనవ, వెఱచి పలికె దిశలు వినఁగ నంత
సీత నాదుపేరు శ్రీరాముభార్యను, నన్నుఁ గావరయ్య మిన్న కిపుడు. 40

వ. అని మఱియును.

ఆ. దేవగణములార! దిక్పాలవరులార!, వృక్షజాతులార! పక్షులార!
కుటిలదానవుండు గొంపోవుచున్నాఁడు కరుణతోడ నన్నుఁ గావరయ్య. 42

గీ. అనుచుఁ బలుకుచున్న యాయార్తనాదంబు, విని జటాయు వనెడి విహగ నాథుఁ
డరుగుదెంచి కలహ మత్యుగ్రముగఁజేయ, రావణుండుఁ బక్షిరాజుఁ దాఁకె. 43

చ. అసురవిభుండు వైచు నిశితాస్త్రముఖంబున నొచ్చి పక్షియున్
గొసరక దైత్యనాయకునిగుండెను నొవ్వఁగఁ దన్ను నంతలోఁ
నగలిరి నిశాచరుండు కరఖడ్గముఁ ద్రిప్పుచుఁ బక్షియుగ్మమున్
వసుధఁ బడంగఁ ద్రుంచి కడు వైళము లంకకు నేగునత్తఱిన్. 44

క. వనచరులోకగిరిచేరువ, వనములఁ జరియింపఁ జూచి వసుధానుతయున్
దనచీరకొంగుతునుకను, దనసొమ్ములు మూటగట్టి ధరపై వైచెన్. 45

క. అంతట దైత్యుఁడు లంకకుఁ, బంతముతో నేగి శింశపాతరుక్రిందన్
సంతసమున నిడి దానవ, కాంతల నవనిజకుఁ దోడు కావలి యుంచెన్. 46

ఉ. అత్తఱి రాఘవుండు తన యాసలఁ బెట్టుచుఁ గొంచుఁబోవఁగా
జిత్తము నొచ్చి యామృగము శీఘ్రగతిన్ బడనేసి దాని పై
తిత్తిని దీసి వెంటఁగొనఁ దెచ్చెడివేళఁ బయోజమిత్రవం
శోత్తముఁ డుల్కఁగానఁబడె నొక్కెడ లక్ష్మణుఁ డన్నదృష్టికిన్. 47

చ. పొడగని గుండె ఝల్లుమన బుద్ధి గలంగుచు రామచంద్రుఁ డ
య్యెడఁ గడు నుగ్రుఁడై పలికె నీవిటు నాకడి కేలవచ్చి త
క్కడ నినుఁ బర్ణశాలకడఁ గావలి యుంచినచోట నొంటిమైఁ
బడతుక డించి రాఁదగునె వన్యమృగోత్కరమధ్యసీమకున్. 48

ఆ. అనుచుఁ బలుకుచున్న యన్నకుఁ బ్రణమిల్లి, వినయవాక్యఫణితి విన్నవించె
జనకతనయపలుకుచందంబు మొగలెత్తి, లవముఁ దప్పకుండ లక్ష్మణుండు. 49

వ. చెప్పినమాటలు విని విస్సందనంబున జిన్నఁబోవుచు దుర్నిమిత్తంబులం గనుచుఁ
దత్తరంబున నాశ్రమంబునకుఁ జని యక్కడ

గీ. పర్ణశాలలోనఁ బరికించి, సీత గానఁబడమిఁ జిన్నవోయి
చిత్తమంతఁ గలఁగి శ్రీరామచంద్రుండు, పలువరింపఁ జొచ్చెఁ బ్రమసి భ్రమసి. 51

సీ. నీదృగ్విలాసంబు నెఱి నభ్యసించెను, గురుకుచఁ గానవే హరిణవిభుఁడ!
నీమంజులాలాపనిచయంబుఁ గైకొన్న, సుకుమారిఁ గానవే పికకులేంద్ర!
నీసిందుసత్కాంతి సొమ్మము గలయట్టి, రుచిరాంగిఁ గానవే రోహిణీశ!
నీపక్షసంస్ఫూర్తి నెనయుధమ్మిల్లంబు, గలయింతిఁ గానవే యళికులేశ!

గీ. స్తనభరంబున నీపోల్కిఁ దనరినట్టి, యతివఁ గానవె చక్రవాకాధినాథ!
తెఱయ నినుఁబోలు నెన్నడ నేర్చినట్టి, రమణిఁ గానవె నీవు మరాళరాజ! 52

సీ. ఘనసారభూజంబ! కానవే నీవంటి, గంధంబు గలయట్టి కరటియానఁ
గదళికాంతరురాజ! కానవే నీయట్టి, మెఱుఁగుఁబెందొడల మహామీననేత్ర
విలసిల్లుచంపకవృక్షంబ! కానవే, లలి నీదుపుష్పవిలాసనాసఁ
గమనీయలత! నీవు కానవే నీయట్టి, కరములు శోభిల్లు కంబుకంఠి

గీ. గ్రిముకధరణీరుహాధీశ! కానవయ్య, నీఫలస్ఫూర్తి కంఠంబు నీలవేణిఁ
గళికలను మించు నవకుంద, కానవమ్మ, నీముకోరకనిభదంత నీరజాస్య. 53

సీ. వనజాస్య! నినుఁగూడి వర్తించు నతిఘోర, వనములు శృంగారవనము లగును
పడఁతి! నీతోఁగూడి పవళించుకర్కశ, శయ్యలు పూవులశయ్య లగును
గలకంఠి! నీచేతి కందమూలాదిభో, జనములు మధురభోజనము లగును
హరిమధ్య! నినుఁగూడి చరియించునటువంటి, తపములు సత్పుణ్యతపము లగును.
గీ. తరలి నీతోడఁగూడి భోగించునట్టి, భోగమంతయు దేవేంద్రభోగ మగును
సుదతి! పొడకట్టఁగదె! నాకుఁజూడవలయుఁ, గన్నులకుఁగానఁబడవేమి కమలనయన.

వ. అని మఱియును. 55
సీ. ఏమృగంబును గన్న నేణాక్షిఁ గానవే, యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేపక్షిఁ గనఁగొన్న నెలనాగఁ గానవే, యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేమ్రాఁకుఁ బొడగన్న వామాక్షిఁ గానవే, యని పెక్కుభంగుల నడిగి యడిగి
యేగుట్టఁ బొడగన్న నభయానఁ గానవే, యని పెక్కుభంగుల నడిగి యడిగి
ఆ. కలఁగు భీతినొందుఁ దలఁకుఁ జిత్తములోన, సొలయు మూర్ఛఁబోవు నలయు నలఁగు
సీత గానఁబడమి శ్రీరామచంద్రుఁడు, విరహతాపవహ్ని వేఁగి వేఁగి. 56
వ. ఇట్లు సీతావియోగంబునకుఁ బలువరింపుచున్న యన్నం గని సౌమిత్రి యిట్లనియె. 57
క. దీనుక్రియ వడి నూరక, మానము సెడి వగవ నేల మనుజేశ్వర! యీ
కాననభూములు వెదకఁగఁ, గాన మీఁదటను వగవఁగాఁ దగు మనకున్. 58
వ. అని ప్రలాపించి కోప మాఁపుకోఁజాలక కన్నులు జేఁజురింప నన్నతో నిట్లనియె.

ఉ. వ్రచ్చెద నాకలోకమునవారలగుండెలు నాగలోకమున్
గ్రొచ్చి యహీంద్రవర్గమును గూల్చెదఁ గ్రొవ్వుపుఁగొండకైవడిన్
దెచ్చెద మర్త్యలోకము నుదారత నేఁటికిఁ గ్రమ్మఱిం
దెచ్చెద సీత నీక్షణమ దేవర చిత్తము మెచ్చునట్లుగన్. 60
వ. అని యిట్లు పలికి మఱియును.
ఉ. చించెద దైత్యసంఘములఁ జెండవఱఁ జేసి బ్రహ్మ బా
ధించెద లోకపాలకులఁ ద్రెళ్ళఁగ నేసెద భూతలమ్ముఁ గ్ర

క్కించెద శైలజాలముల గీడటఁగించెద భూమినందనన్
గాంచెదఁ దల్లడిల్లకుము కంజహితాన్వయవార్ధిచంద్రమా. 62

క. భూతలమును నాకసమును, బాతాళంబును వెదకియొ బాధించియొ నే
సీతను దెచ్చినపిమ్మట, నీతమ్ముఁడ ననుచు మెచ్చు నిఖిలోర్వీశా. 63

వ. అని పలుకుచున్న తమ్ముని శౌర్యధైర్యాదిగుణంబులకు సంతోషింపుచు జనస్థానంబు
వెడలి జనకనందన నన్వేషింపుచు దక్షిణాభిముఖులై చనుచు ముందట. 5

క. పక్షములుఁ గాళ్ళుఁ దునిఁగిన, పక్షీంద్రుఁ జూచి రామభద్రుఁడు మదిలో
రాక్షసమాయయె యనుచును, శిక్షింపఁ దలంచునంత శీఘ్రమె పలికెన్ 55

క. నీతండ్రికి నతిమిత్రుఁడ, నోతండ్రీ! నన్ను నేయనుచితమె నీకున్
నాదగుపేరు జటాయువు, సీతాధిప! నన్ను నెఱుఁగు చిత్తములోనన్. 66

వ. అని చెప్పి వెండియు నాజటాయు విట్లనియె. 67

మ. విను మోరాఘవ, పంక్తికంఠరుఁడు దోర్వీర్యంబు సంధిల్లఁగా
జనకక్ష్మాపతినందనన్ గొనుచు స్వేచ్ఛావృత్తితో నేగుచో
వనితారత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా
విని పోరాడఁగఁ బాత్రమయ్యె మఱి యీవేషంబు భూమీశ్వరా. 68

క. అని సీత తెఱఁగుఁ దనపని, జననాయకుఁ డైనరామచంద్రునితోడన్
వినుపించి యాజటాయువు, తను వెరియఁగ నంతఁ గాలధర్మము నొందెన్. 69

వ. ఇట్లు రామచంద్రునకు సకలవృత్తాంతమును నెఱిఁగించి శరీరంబు విడిచిన యప్పక్షి
రాజునకు భక్తిపూర్వకంబుగా నగ్నిసంస్కారాదివిధులు తీర్చి దక్షిణాభిముఖులై
చనుచుఁ జిత్రరూపంబున నున్న కబంధుని వధియించి ముందట. 70

క. చని చని యెదుటను రాముఁడు, గనుఁగొనియె మహీజనోగ్రకలుషాద్రిమహా
శనిరూపం బనఁ దగు నా, ఘనముక్తివధూవిలాసకబరిన్ శబరిన్. 71

గీ. కాంచినను మ్రొక్కియాభూమికాంతునకును, మించ సద్భక్తిఁ బూజఁగావించినంత
శబరితోడను దమ కార్యసరణిఁ దెలియ, వినయమునఁ జెప్ప నాకాంత విన్నవించె.

గీ. ఇనకులాధీశ! సుగ్రీవుఁ డనెడువాఁడు, కపికులశ్రేష్ఠుఁ డత్యంతఘనుఁడు దలఁప
నతనితోఁ బొత్తు గావింపు మన్నిపనులుఁ, జక్క నౌటకు నాత్మ నిస్సంశయంబు. 73

వ, అని చెప్పి వీడ్కొలిసిన నమ్మనుజేంద్రనందను లటమీఁదఁ బంపాతటంబునకుం జని రని చెప్పునారదుని వాల్మీకిమునీశ్వరుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు.

క. జలజాక్ష! భక్తవత్సల!, జలజాననవినుత పాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!, జలజాకరచారుహంస! జానకినాథా!. 76

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురులింగజంగమార్చన వినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుత ఆతుకూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునం దారణ్యకాండము
సర్వము నేకాశ్వాసము.





శ్రీరస్తు.

# మొల్లరామాయణము



## కిష్కింధాకాండము



శ్రీఁదప్రియాహా! గిరిజా
త్ర్యక్షమనోజ్ఞాతగేహా! యపహృతమోహా
రాక్షసభీమా! మునిజన
సాక్షాత్కృతనైజధామ! జానకిరామా!

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునీశ్వరున కెఱింగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము.

సీ. పంపాతటమ్మున బాణాసనాయుధ, పాణులై యున్న భూపాలసుతులఁ
గనుఁగొని భీతిల్లి కమలాప్తసూనుండు, వాలిపంపున వీరు వచ్చి రనుచుఁ
గలఁగి తా ఋష్యమూకంబున నుండఁగ, వెఱచి మలయశైలవిపినసీమఁ
దిరిగి వారలరాక తెఱఁగెల్లఁ దెలిసి రాఁ, బవనాత్మజుని వేగఁ బంప నతఁడు

గీ. వచ్చి రఘురాముశ్రీపాదవారిజములఁ, గద్ధఁ బ్రణమిల్లి మీ రెవ్వరయ్య యనుచు
నేమికతమున వచ్చితి రేది నామ, మనుచు నడిగిన సౌమిత్రి యతని కనియె.

సీ. దశరథుం డనురాజుతనయుండు మాతని, పంపునఁ దప మాచరింపఁ గోరి
వచ్చి కాననభూమి వర్తించుచుండ నీ, రాజు దేవిని దుష్టరావణుండు
కుటిలవృత్తిని గొనిపోవ నాజాడ, వదలక దిక్కులు వెదకి వచ్చి
శబరికి మాఱాకచందంబుఁ దెలియఁగఁ, జెప్పిన నర్కజుచేతఁ గాని

గీ. మీదు కార్యంబు సెగ్గదు మీర లరిగి, వేగ సుగ్రీవుచెల్మి గావింపుఁ డనిన
వచ్చినారము గనుఁగొన వలసి యితఁడు రాముండు లక్ష్మణుం డండ్రు నన్ను. 4

గీ. తలఁప నీరాజునకు నేఁడు ధాత్రిలోన, విను మసాధ్యంబు లైనట్టిపనులు లేవు
సూర్యవంశోత్తముఁడు మహాశూరుఁ డితఁడు, నీకుఁ బేరేమి చెప్పుమా మాకు నన్న.

తే. వాయుదేవునిఁ బ్రార్థించి వేయిరీతుల, నంజనాదేవి గాంచిన యాత్మజుండ
నర్కజునిమంత్రినై యుండు ననుదినంబు, వినుఁడు నా పేరు హనుమంతుఁ డనఁదగును. 7

వ. అని చెప్పి మఱియు నిట్లని విన్నవించె.

చ. వినుఁడి మహాత్ములార! యరవిందహితాత్మజుఁ దోడి తెచ్చి మి
మ్మును బొడగాచుచింతు నని మ్రొక్కుచు వేగ కపీంద్రుఁ జేత తాఁ
జనిన తెఱంగు వానిఁ గనుచందము నేర్పడఁ జెప్పి గొబ్బునన్
బనిగొని వచ్చి రాముపదపంకజముల్ కనుపించె నంతటన్. 8

వ. సుగ్రీవుండు శ్రీరామచంద్రుని పగదీర్పఁ దా భావంబు వహించి తనకుఁ బగవాఁ
డైన వాలిని జంపింపం దలంచి వానితోఁ దనకుఁ గలిగిన పూర్వవైరంబు తెఱంగు
శ్రీరామునకుఁ దెలియ విన్నవించి వాలి మహాసత్త్వశాలి యతండు రామునిచేఁ జెడు
టకుఁ జెల్లంబుగా దుందుభికళేబరంబును బదియోజనంబులదూర మెగరఁ జిమ్ముట
యును సప్తతాళంబు లొక్కబాణంబునఁ దెగవేయుటయును జూచి సుగ్రీవుండు
భయకంపితహృదయుండై రాఘవేశ్వరుల పాదారవిందంబులకు వందనం బాచరించి
జనకనందన మున్ను జాఱవిడచిన యాభరణంబుల మూటఁ దెప్పించి చూపినం జూచి
మూర్ఛిల్లి గొబ్బునం దెలిసి యర్కకులేశ్వరుం డైన శ్రీరామచంద్రుం డర్కసంభ
వుం డైన సుగ్రీవునితో నిట్లనియె. 9

క. పగ నీ కెక్కడి దింకను, నగచర నగభేదిసుతుని నాయస్త్రమునన్
దెగ నేసెద నమ్ముమనుచు, జగదీశుఁడు పలుక నతఁడు సంతోషించెన్. 10

వ. ఇట్లు ప్రమాణవచనంబుల నయ్యచలచరాగ్రణిస్వాంతంబును సంతోషింపఁ జేసిన
నతండును శ్రీరామచంద్రుని కార్యంబునకు సహాయుండై యుండ నొడంబడి యమ్మ
హానాయకుని యనుమతంబున యుద్ధసన్నద్ధుండై కిష్కింధానగరంబునకుం జని
తద్ద్వారంబున నిలిచి సింహనాదంబుఁ జేసినం గని యాదేవేంద్రతనూభవుండు
సనుదెంచె నంత నయ్యిరువురుం గడసి భుజంబు లప్పళించుచు గర్వాలాపంబు లాడుచు
నొండొరు మార్కొని. 11

శా. శైలంబుల్ గడువేగ ఱువ్వుచు మహాఝుంకారహుంకారముల్
చాలం జేయుచు భీకరోద్ధతులచే సాలంబులన్ వ్రేయుచున్

వాలాగ్రంబుల మోదుచున్ వడివడిన్ వక్త్రంబులన్ రక్తముల్
గూలన్ వాలియు సూర్యసూతియు వడిం గోపాత్ములై పోరఁగన్. 12

వ. అట్టిసమయంబున. 13

ఉ. సాలముపొంత నిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి శబ్దరి
న్మూలము గాఁగ విల్ దివిచి ముష్టిగు దృష్టియుఁ గూర్చి గోత్రభృ
త్కూలము వజ్రపాతహతిఁ గూలువిధంబునఁ గూలనేసెనా
వ్వాలిఁ బ్రతాపశాలి మృదువందనశీలి సురారి మెచ్చఁగన్, 14

వ. తదనంతరంబున. 15

క. తారాపతి శిక్షింపుచుఁ, దారాపతి ధవళకీర్తిఁ దగునర్కజునిన్
దారాదేవికిఁ బతి గా, తారార్కము గాఁగ రాజతనయుఁడు నిల్పెన్. 16

క. నిగ్రహము మాని నృపతి శు, భగ్రహలగ్నంబునందుఁ బట్టము గట్టెన్
విగ్రహరాజోపగ్రహు, సుగ్రీవుని హేమదామసుగ్రీవుఁ దగన్. 17

వ. ఇట్లు సుగ్రీవునిఁ గపిరాజ్యపట్టభద్రునిం జేసి వాలితనూసంభవుని నంగదకుమారుని యువరాజపదంబున నిలిపె నంత వర్షాకాలము గడుచునంతదనుక శ్రీరాముని మా ల్యవంతంబుపైనుండ నియమించి వారు సని రయ్యవసరమున. 18

సీ. బ్రహ్మాండ మదలంగఁ బటపటధ్వనులతోఁ, నుఱుము లంతంతకు నుఱుముచుండఁ
గడు భయంకరముగా వడి మ్రోఁగుమ్రోఁతల, బిడుగు లాడాడ గుభిల్లు మనఁగఁ
గముకంబులం లేసి కణములతోఁగూడ, గరుడు గట్టిన వడగండ్లు రాలఁ
గొఱవిదయ్యంబుల వెఱపించుతెఱఁగున, విద్యుత్ప్రకాశమ్ము విస్తరిల్ల

గీ. ముసుఁగువేసినచందాన మొగులు గప్పి, మీఱి నలు పెక్కి చీఁకట్లు కాఱుకొనఁగ
మించి కడవల నుదకంబు ముంచి తెచ్చి, కుమ్మరించినగతి వాన గురిసె నపుడు.19

క. ఏఱులు కాల్నడ తప్పఁగఁ, బాఱెను సస్యములు పండె ఫలవృక్షములున్
మీఱి ఫలించెను ధరఁ బా, లేరులు గా సురభులెల్ల నెప్పుడుఁ బితికెన్. 20

వ. అంత వర్షాకాలాంతంబు గాఁగ నమ్మహీకాంతుండు ప్రేయసీవియోగపరితాపాన లంబునఁ బొరలుచు నోర్వలేక విభ్రాంతస్వాంతుండై యుండ. 21

సీ. పలుమాఱు నీహస్తపల్లవంబులచేత, నలివేణి! నాతాప మార్ప వేల
నళినాక్షి! పరిరంభణక్రీడఁ దేల్చు నీ, మది నొప్పి నానొప్పి మాన్ప వేల
చెలియ! యోష్ఠామృతసేవకై నీ యల్క, పడిఁ దప్పి నాదప్పి గడప వేల

భామ! తాపానలపరితాప మడఁప నీ, తనువు నాతనువునఁ జెనచవేల
గీ. యనుచు సీతఁ బిలుచు నందంద పలికించు, దిక్కు లాలకించు నిక్కిచూచు
దశరథాత్మజుండు తన్నుఁ దా మఱచుచు, బయలు కౌఁగిలించు బలువరించు. 22

వ. అని మఱియును. 23

ఉ. కూఁకలు నోటికిన్ రుచులు గూడుట దప్పెను దుంపదూడులుం
గారము తోఁచె జిహ్వకును గమ్మని తేనెలు చేఁదులయ్యెఁ గం
గా రయెఁ జిత్తమంతయును గంటికి నిద్ర వహింపదయ్యె శృం
గార మెలర్పసీతఁ బొడగానమి రామనృపాలమౌళికిన్. 24

ఉ. తాలిమి దూలిపోయి పరితాపమునం దిరుగాడు నొక్కచోఁ
గాలును నిల్వఁ ద్రొక్క నధికారము చాలక యెప్పుడుం గడుం
జాలినహించుఁ జిత్తమునఁ జంచలతం గనుభూమిపుత్రిపై
మేలిమిఁ జేసి రాముఁ డట మిన్నక వేసరుగొన్నకైవడిన్. 25

వ. ఇట్లు విరహతాపంబునఁ బొరలుచున్న సమయంబునఁ గార్తికమాసంబు సనుదెంచిన శ్రీరామచంద్రుఁడు బలంబులం గూర్చుకొని రమ్మని సుగ్రీవుపాలికి సౌమిత్రి ననుప నారామానుజన్మునిఁ గూడి యినజుండు తారాసమేతుండై చనుదెంచి రాఘవేశ్వరుల చరణారవిందమ్ములకు నమస్కరించి తనబలంబులఁ దోడు సూపం దొడంగె నెట్లు నినఁ బదులును నూఱులును వేలును బదివేలును లక్షలును బదిలక్షలును గోట్లును శతకోట్లును నర్బుదంబులును నిర్బుదంబులును ఖర్వంబులును మహాఖర్వంబులును బద్మంబులును మహాబద్మంబులును క్షోణులును మహాక్షోణులును శంఖంబులును మహాశంఖంబులును క్షితులును మహాక్షితులును క్షోభంబులును మహాక్షోభంబులును నిధులును మహానిధులును సాగరంబులును మహాసాగరంబులును బరిమితంబులును మహాపరిమితంబులును ననంతంబులును మహానంతంబులును గడచి లెక్కకు మిక్కిలి యెక్కువయై డెబ్బదిరెండు వెల్లువలు గల కపిబలంబుతోడఁ దోడు చూపినంజూచి రాఘవేశ్వరుండు సంతోషించి సవిత్రునందను గారవించి కౌఁగిలించుకొని సీతాన్వేషణంబుఁ జేయఁగలవానరోత్తముల నధికబలయుతుల నేర్పఱచి దిశలకుం బంపు మనవుడుం దూర్పునకు మైందుఁడును బశ్చిమంబునకు సుషేణుండును నుత్తరంబునకు శతబలియును నను వారల నేర్పఱచి వారలకుఁ దోడుగా వానరవీరులను లక్షలక్ష సంఖ్యాకుల నేర్పఱచి యిచ్చి జానకియున్న చొప్పును దెలిసి యొక్క నెలలో

రమ్మని యనిపి హనుమంతునిం బిలిచి నీవు దక్షిణమ్మునకుం బొమ్మని యనుపునప్పుడు శ్రీరామభూపాలుండు వాని విశ్వాసాదిగుణమ్ములకు మెచ్చినవాఁడై దగ్గఱగాఁ బిలిచి నీవు కార్యవంతుఁడవు హితుండవును గాపున నీచేత మత్ప్రయోజనం బీడేరునని పలికి తనచేతి యంగుళీయకం బొసఁగి యీముద్రిక జనకరాజనందనకు సమర్పించి యాజానకి శిరోరత్నంబు మా కానవాలుగాఁ దెమ్మని యనుపనతం డియ్యకొని మ్రొక్కిన నాతనికిం దోడుగా నంగదజాంబవదాదులం గూర్చి యని పెనుపుటయును విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయును. 26

క. జలజాక్ష! భక్తవత్సల!, జలజాసనవినుతపాదజలజాత? సుధా
జలరాశిధన్యమందిర! జలజాకరచారుహంస! జానకినాథా! 27

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగమార్చన వినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయవిరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు కిష్కింధా కాండము
సర్వము నేకాశ్వాసము.



శ్రీరస్తు.

# మొల్లరామాయణము



## సుందరకాండము.



క. సూర్యకులరత్నదీపా!
సూర్యసహస్రప్రతాప! సుందరరూపా!
ఆర్యారాధితనామా!
శౌర్యాదికసుగుణధామ! జానకిరామా! 1

వ. శ్రీనారద మహాముని వాల్మీకి కెఱిఁగించిన తెఱంగు విన్నవించెద నవధరింపుము. 2

గీ. రామునకు మ్రొక్కి యక్కపిరాజుకరుణ, దత్తశాసనమున వెడలి దక్షిణంబు
వెదకువా రగుహరివీరవరులు, పంతములతోడ నంగదయును సంతసమున.

క. మును తా మేగిన దిక్కులు పనివడి వెదకంగఁ జనిన బలిముఖులెల్లన్
జనకజఁ గానక వచ్చిరి మనుజేశ్వరుకడకుఁ జనినమార్గంబున నే. 4

వ. అట్టి సమయంబున. 5

క. గిరులును నదులును వనములుఁ, బరికింపుచుఁ బట్టణములు బహువిధగతులన్
దిరుగుచు వెదకుచు గానక కరువలిసూనుఁడు కాది యైనకపివరు లెదుటన్. 6

క. ఆలోకించిరి సత్కపి, జాలముఁ గరిశరభసింహశార్దూలస్ఫురత్
కీలముఁ బుణ్యకదంబవి, శాలము నగునమ్మహేంద్రశైలము లీలన్. 7

వ. ఇట్లు మహేంద్రపర్వతంబుఁ గనుంగొని డాయం జని యచ్చట. 8

ఉ. ఆతఱి వానరప్రవరు లాధరణీసుతఁ గానలేక దుః
ఖాతురులై ప్రగల్భపడఁగ నయ్యెడఁ గద్దెనుండి వచ్చి సం

పాతి యనం బ్రసిద్ధిఁ డగుపక్షికులేంద్రుఁడు రావణుండు దా
సీతను గొంచుఁ బోవుగతిఁ జెప్పుచుఁ జెప్పెను లంకత్రోవయున్

క. ఆపక్షీంద్రునిచేతను జాపలశుభ్రనేత్ర రామచంద్రుని దేవిన్
బాపాత్ముఁ డైనదైత్యుఁడ, వే పట్టుక చనినత్రోవ విని కపులెల్లన్, 10

వ. మహానందము నొంది యమ్మహేంద్రపర్వతం బారోహించి పురోభాగంబున. 11

క. ఆకపివీరులు గనుఁగొని రాకాశవశీప్రచుంబి తార్క్ష్యభంగా
నీకమహాఘనిరవభయ, దాకారనటప్రకాశు నాజలధీశున్. 12

వ. ఇట్లు గనుంగొని. 13

క. తమ తమ సత్త్వస్థితులును, గమియించెను నబ్ధిఁ గాలదిఁ గనుఁగొని మదిలో
భ్రమయుచుఁ బలికెను గపిసం, ఘము లెంతయు నొందమునుఁ గళవళమనుచున్.

క. ఈవార్ధి దాఁట సత్త్వము, మావలనం జాల దింక మారుతి! వినుమా
పావని వగుటం జేసియు, నీవలనం దక్క నొరులు నేరరు దాఁటన్. 15

వ. అని యిట్లు ప్రార్థించినతోడనే యబ్బి వారివచనంబులకు సమ్మతించి వాయు
తనూజుం డిట్లనియె. 16

ఉ. పావనమూర్తి రామనరపాలకుపంపున నబ్ధి దాఁటెదన్
దేవవిరోధి దొంగిలినదేవిని జూచెదఁ గానకుండినన్
లావున గడ్డతోఁ బెఱికి లంకయె తెచ్చెద నట్లు గాకచో
రావణుఁబట్టి తెచ్చెదను రామునిసన్నిధి కెన్నిరీతులన్. 17

వ. అని వారిమనంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు వక్కాణించి తనకుఁ దండ్రియైన
వాయుదేవునకును త్రిమూర్త్యాత్మకుండైన లోకబాంధవునకును నింద్రునకును సంద్ర
మ్మునకును నమస్కరించి శ్రీరామలక్ష్మణులఁ దనమనఃపద్మంబునం దిడికొని మ్రొక్కి
బంధుమిత్రులం గౌఁగిలించుకొని వారిచే దీవనలం బొంది గమనోన్ముఖుండై. 18

చ. మొగము బిగించి పాదములు మొత్తముగా నట నూఁది త్రొక్కి నీ
టుగ మొగ మెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహుల
త్యగణితలీల నూఁచి వలయంబుగ వాలముఁ ద్రిప్పి వ్రేఁగునన్
నగము నగమ్ము గ్రుంగఁ గపినాథుఁడు నింగికి దాఁటె నువ్వనన్. 19

వ. ఇట్లు నింగి కెగిరిపోవుచుండుసమయంబునఁ బావనికి నడ్డంబుగా మానవరూపంబున
మైనాకపర్వతంబును సురస యను నాగజననియు ఛాయాగ్రాహిణి యైనసింహిక

యును గనుపట్టిన నెల్లర నతిక్రమించి సువేలాచలంబునకరిగి యక్కడ నలయిక
దీఱ నొక్కయిక్కువ నించుకసేపు విశ్రమించి యున్నసమయంబున. 20

ఉ. భేరికి సాటి యౌ దనుజభీషణభామలభద్రనాగఘీం
కారనినాదముల్ హయనికాయపుహేషలు కాహళధ్వనుల్
వీరమృదంగనాదములు విశ్వభయంకరలీలలంకలో
బోరుకలంగఁగా శ్వసనపుత్త్రుఁడు చాలఁగ నాలకింపుచున్. 21

ఉ. కోటికిఁ గోటులై పరఁగుకుంజరవర్గము ఘోటకంబులున్
గోటికి నెక్కుడై పరఁగుగోత్రసమానము శారథంబులున్
గోటికి హెచ్చులై పరఁగు ఘోరనిశాచరకోటికోట్లతో
సాటికి నెక్కువప్పురము సాహసవంతుఁడు గాంచె ముందఱన్. 22

వ. తల్లాలంకాపురభేదనంబురన్ వీక్షించి తనమనంబున. 23

శా. ఘోరాకారులు కామరూపులు మహాక్రూరాత్ము లత్యుగ్రశ్రీ
శూరుల్ వీరలఁ గన్నుఁ బ్రామి పురిలో శోధించు టెట్లొక్కొ యీ
యీరూపంబునఁ బోవఁగాఁ గనిన వారెగ్గెలు గావింతురో
నారీరత్నము సీత నందుఁ గనఁగా నాకెట్లు సిద్ధించునో. 24

వ. అని తలంచుచున్న యవసరమ్మున.

ఉ. క్రుంకెఁ బయోజబాంధవుఁడు గూండ్లకుఁ బక్షులు సేరె నెల్లెడన్
బొంకము తీసెఁ దామరలు పూచెను గల్వలు తారకావళుల్
బింకముఁ జూపెఁ గాంతి నళిబృందము కూర్కెఁ దమంబు పర్వె నే
వంకను జారచోరకులు వాలి చరించిరి కౌతుకంబునన్ 26

వ. ఇట్లు నిశాసమయమునందుఁ దన మేటిగాత్రం బణుమాత్రంబుగా సంకోచించి యగ్గిరి
డిగ్గి చనుచు నల్లనల్లనఁ బురద్వారంబునొద్దకుఁ జేరి వానరపుంగవుండు పురప్రవే
శంబు సేసి.

ఉ. మేడలు రచ్చకొట్టములు మిద్దెలు మచ్చులు నాటపాటముల్
మాడువు లంగళుల్ దనుజమందిరముల్ పురగోపురావళుల్
వాడలు దేవగేహములు వప్రచయంబులు వేశ్యవాటికల్
గోడలు నాటగాఁగఁ గపికుంజరుఁ డప్పుడు చొచ్చి చూచుచున్. 27

దోయదపథంబున నమేయరుచితోడ నుడు
రాయఁడును మించి వడఁ గాయఁగఁ గడంగెఁ
గోయిలలుఁ గీరములుఁ గూయఁగ నళివ్రజము
లేయెడలఁ జూచినను మ్రోగుచుఁ జెలంగెఁ
గాయెడఁ గృపారసము సేయక వివేకమున
నీయెడల నుండు టిది న్యాయమె లతాంగీ! 44

వ. అని మఱియును.

సీ. అలకేశ్వరుం డుపాయనముగా నిచ్చిన, యంచిత దివ్యచీనాంబరములు
దివిజాధినాథుండు దినదినంబును నిచ్చు, పారిజాతోల్లసత్ప్రసవములును
దక్షిణాధీశుండు తగఁ గానుకలంపినఁ సురభికర్పూరాదిపరిమళములుఁ
బాతాళముననుండి ఫణిసార్వభౌముండు. పుత్తెంచినటువంటి భూషణములుఁ
గీ. గలవు నాయింట నేప్రొద్దుఁ గడమలేక, దేహపరితృప్తిఁ గావించి మోహ మలర
గామకేళిసుఖంబులఁ గలయు టొప్పుఁ విడువు మడిమూస రామభూవిభునిమీఁద.

సీ. ఎవ్వానివీటికి సేదువారాసులు, పెట్టనికోటలై పెచ్చు పెరుఁగు
నెవ్వాని సేవింతు రింద్రాదిదేవత, లనుచరబలు లయి యనుదినంబు
నెవ్వాని చెఱసాల నేప్రొద్దు నుందురు, గంధర్వ సుర యక్ష గరుడకాంత
లెవ్వానిభండార మిరవొంద విలసిల్లు, నవనిధానంబుల విభవభంగి
గీ. సకలలోకంబులును మహోత్సాహవృత్తి నెవ్వనికిఁ జెల్లుఁ బుష్పక మెక్కి తిరుగ
నాకె తక్కంగఁ గలదె యేనాఁట నైన, మత్భుజాశక్తి ప్రతిపింప నద్భుతంబు. 37

సీ. శ్వసనుండు లోఁగిలి సమ్మార్జనముఁ జేయు, నబ్ధినాథుఁడు కలయంప సల్ల
బావకుం డరుదెంచి పాకంబు లొనరింప, శమనుండు వెసఁ బరిచర్యఁ జేయఁ
బాకారి కల్పకప్రికరంబు లర్పింప, దనుజేశ్వరుండుఁ గైదండ యిడఁగ
నరవాహనుండు దా నగరివెచ్చము వెట్ట, నీశానుఁడు విభూతి నెలమి నీయ
గీ. గురుఁడు పంచాంగ మెప్పుడు సరవిఁ జెప్ప, నమరకిన్నరగంధర్వయక్షభుజగ
సిద్ధకింపురుషాంగనల్ చేరి కొలువ, వైభవంబునఁ జెలువొందువాఁడఁ దరుణి! 48

ఉ. ఎత్తితి శంకరాచల మహీనబలంబున బంతిలాగునన్
మొత్తితి సర్వదిక్పతుల మూఁగిన గర్వము విచ్చిపోవఁగా
నొత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున భూమిఁ ద్రెళ్ళఁగా
మొత్తితి భోగికంఠను లమోఘభుజంబున మేటికీర్తులన్. 49

గీ. జడలు ధరియించి తపసులచందమునను, దుమ్ముగొను దారు ఘోరదుర్గంబులందుఁ
గూరగాయలు కూడుగా, గుడుచునట్టి. రాముఁ డేరీతి లంకకు రాఁగలండు. 50

గీ. ఇంకఁజేయ వేర రీఁదంగ రోవరు, కట్టలేరు చుట్టి పట్టలేరు
జలధి దాఁట లావు చాలరు నరులను, వచ్చు టెట్లు చెప్పుము వనజాక్షి. 51

క. దానవులెప్పుడు జూచిన, మానవులను గెలువఁ గలుగు మదినూహింపన్
మానవభక్షకులైనను, దానవులను గెలువ నలవి తరమే జగతిన్. 52

క. జగతీశుఁడు మానవుఁ డట్టి, నగరే భుజశక్తి చేత నాకెవ్వరున్
నగధరుఁడో నగధన్వుఁడో, నగవేఁయౌ నొంటరొంటి వాతోఁ బోరన్. 53

వ. అది యట్లుండ నిమ్ము. 54

క. నీకన్నుల సౌభాగ్యము, నీనవముఁ గలుగు సేలు నీముఖకాంతుల్
నీకరములలావణ్యము, నాకన్నులకును లేవు నాడుం జూడన్. 55

మ. సురకాంతల్ సరిగారు యక్షసతులున్ సూటింపగా రారు కి
న్నరభామల్ ప్రతిరారు సిద్ధవనితల్ న్యాయంబుగా నీతోల రా
గరుడస్త్రీలసమాన లెంచఁగా చంద్రకల్ గంధర్వకాంతలీక్షింపన్
మఱి యేలే సిరుఁ జెప్ప చెప్పఁ దగుణల్ మన్మోహనాంగస్తనీ. 56

క. పీఁడ యలంకారముగా, నాశము భయము మఱిగి నాగరమైన మృగాస్తుల్
జేడిసల నేలుకన్నులఁ, జూనుము కరుణప్ప లెత్తి సుదతీ నన్నున్. 57

వ. అని యిట్లు నోటికి వచ్చినచొప్పునఁ బ్రేలుచున్న యానీచుని దుష్టభాషణంబులకు
రోసి తృణంబు చేపట్టి జనకభూపాలనందన యిట్లనియె. 58

క. పతి దైవముగా నెప్పుడు, మతిఁ దలఁచుచు నుండునట్టి మగువలఁ జెఱుపన్
బరిఁన గలయట్టి నీతోఁ, బ్రతివచనము లాడుకంటెఁ బాపము గలదే. 59

క. పరదారాపేక్షకు లగు, పురుషుల కాయువు నశించుఁ బుణ్యము సెడు స
త్పురుషులు దూషింపఁగఁ దుది, నరకంబున బడుదు రనెడి న్యాయము వినవే. 60

వ. అదియునుంగాక. 61

క. తన సాహసంబు తానే, కొనియాడు నతండు హీనగుణుఁ డని వినుదున్
నిను నీవ పొగడుకొంటివి, వినఁగూడదు నీ యనీతివిరహితభాషల్. 62

ఉ. సంగరరంగమందు నతిశౌర్యమునన్ రఘురాముతోడ మా
తంగ తురంగ సద్భట శతాంగ బలంబులఁ గూడి నీవు పో
రంగను నోప కిప్పుడు ఖరాదులపాటుఁ జూచియున్
దొంగిలి నన్నుఁ దెచ్చితివి తుచ్ఛపుఁబల్కులు పల్కఁ బాడియే. 63

సీ. కూఁకటిముడికైన కురులు గూడనినాఁడె, బెదరక తాటకఁ బీచ మణఁచె
గాధేయుఁ డొనరించు క్రతువును రక్షింపఁ, బెక్కండ్రు దైత్యుల నుక్కణఁచె
నవనిపై విలసిల్లు నఖిలరాజన్యులు, వేలుఁ జూపఁగ లేని విల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరునప్పుడు, ఖరదూషణాదిరాక్షసులఁ జంపెఁ
గీ. బాదరజమున నొకరాయి పడఁతిఁ జేసె, లీల మాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండె మేదినీరక్షకుండు, రామభూపాలుఁ డాదినారాయణుండు. 64

గీ. అట్టిరామున కీవబ్ధి యనఁగ నెంత, లంక యన నెంత దనుజులపొంక మెంత
నీవనఁగ నెంత నీలావు చేవ యెంత, చెప్ప నేటికి నీవె చూచెదవు గాక. 65

శా. వీరాలాపము లాడ నేల నిను మీ విశ్వప్రకాశంబుగాఁ
బారావారముఁ గట్టి రాఘవుఁడు కోపస్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజిన్ నిను డాసి లావుకలిమిన్ గోటీర యుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబుల మస్తముల్ దునిమి భుక్తుల్ పెట్టు భూతాళికిన్. 66

శా. ఆరూఢప్రతిమానవిక్రమకళాహంకారతేజోనిధిన్
శ్రీరామున్ సుగుణాభిరాముఁ దెగడన్ జేకొన్న నిన్నాజిలో
దారన్ దొంగిలి తెచ్చు శిక్షకొఱకై దండించి ఖండింప ము
న్నీరెట్లైనను దాఁటివచ్చునలుకన్ నేఁ డెల్ల శాంతింపుమా, 67

వ. అని తన్నుం జీరికిం గొనక వీరాలాపంబులాడ నారావణుం డోడుపు దప్పిన కాలాహివదనంబున నుగ్రుండై మండిపడి యిట్లనియె. 68

క. ఆటవి గా యని కపిస్వామి, పాటించినకొలంది నన్నుం బలుకంగం జొచ్చెన్
మాటాడకుండ నాలుకం దూంటులుగాం జేయకున్న దోసము గాదే. 69

క. పయ్యాదక నాముండవు, నయ్యమునకుం గాలు దువ్వంగడంగెను దీనిన్
దయ్యాలకు బలి వెట్టక, వియ్యలుగా నటికె యెట్లు వాయనుజూచెన్. 70

క. కాకున్న దీని బలిమిని, జైకొని నాకాంక్ష దీఱ భావజకేళిన్
జేకొనక విడిచి పెట్టిన, నైకొను నే నవ్వుంగాక గర్వము పేర్మిన్. 71

శా. భీమాటోపభుజప్రతాపమహిమన్ భీమాచలం బెత్తి సు
త్రామాద్యష్టదిగీశసైన్యముల సంగ్రామంబులన్ నొంచి యా
ద్దామప్రౌఢిం జెలంగుచుండెడు కళాధాముండ నాముందటన్
రామున్ దీమునిం జెప్ప నిప్ప నగరా రాకేందుబింబాననా. 72

సీ. అఖిలలోకముల నాయాజ్ఞ నిల్పితి నేక, హేలను బుష్పకం బెక్కి తిరిగి
నల్వమూంకలచేత వెట్టి సేయించితి, దితివంశవల్లభుల్ నుతులు సేయ
గణములతోంగూడం గైలాస మెత్తితి, బటువైనపూవులబంతిపగిది
వనజగర్భునిచేత వరములు గైకొంటి, పండిగా నత్యుగ్రతపము సల్పి

గీ. చెఱలు పట్టితి గంధర్వ సిద్ధ సాధ్య, భుజగ సుర యక్ష కిన్నర ముఖ్యసతుల
నిట్టిసామర్థ్యము మెవరి కేనాండు గలదు, మహిని నాకొక్కనికె కాక మంజువాణి!

గీ. నాకు నెదురింప నొక పేదవనుసినొడ్డి, వెఱవ కీర్తి దుర్భాష లఱచు దీని
జిహ్వ మొదలంట బట్టి యీంకెత్తాకున, ఖాకం దునుమాడి ధారుణిం బాఱవైతు. 74

వ. అని చంద్రహాసంబు జళిపించి లేవ నుంకించు తఱిం గొందఱు శ్రీయుసుందరు లడ్డంబు సొచ్చి.

చ. సురపతియో ధనంజయుండో సూర్యతనూజుండో యాతుధానుండో
శరధినిభుండో గాడ్పొ పురశాసనమిత్రుండో భోగిభూషుడో
గురుభుజశక్తి గైకొనుచుం గోపము సూపంగ నీకు నెంత యి
త్తరుణిపయిం బ్రతాపమున దారుణకృత్యము సేయం గూడునే. 76

క. ఏటికి మీ రిటు కినియంగ, గాటపుజంకెనయె చాలుం గరవాలున కీ
యాంటది యగ్గయె మము నీ, మాటకి మన్నించి కావుమా యికం జాలున్. 77

వ. అని శాంత వచనంబులఁ బ్రియంబు సెప్పిన నప్పంకరుహాక్షుల విన్నపంబులు మన్నిం
చి యా రాక్షసచక్రవర్తి యై దేవికిఁ గావలి యున్న యేకజటా ద్విజటా త్రిజటా
దుర్ముఖీ వాయుముఖీ శూర్పణఖాదిగాఁగల దైత్యకామినులఁ దంకఁ గనుంగొని. 78

క. గడు విచ్చితి నిరుమాసము, లాడఁబరుపు లుసు నేర్పట్టు లాడఁబనున్నన్
గడికండలుగాఁ గోసుక, పడఁతులు భక్షింపుఁ డింతిపలలం బంతన్. 79

వ. అని రోషారుణిత నేత్రుండై యతిభీషణాకారంబుఁ దాల్చి పలికిన. 80

క. జనపతి నిందించుటయును, జనప్రియములు చెప్ప వినక తక్కిన మీఁదన్
దనఁ జంపుఁ డన్నమాటకు, నినకులవల్లభుని దేవి యేమేర్చెన్ జెలుచన్. 81

సీ. జానకి శోకింప సాధ్య కిన్నర యక్ష, గరుడోరగామరకాంత లెల్ల
వెంటనే శోకింప విని గంధవహపుత్రుఁ, డాత్మలోఁ జింతించి యాగ్రహమున
నీదుష్టదైత్యుపై నిప్పుడే లంఘించి, చెండాడి నా చేతఁ జిక్కనేని
కార్యంబు లెస్సగుఁ గాక సత్త్వము తూలి, బలుఁడి వీఁడు వేఁ బడిరి నేని

గీ. సీతఁ గానంగ లేక కృశించి రామ, భద్రుఁ డడఁగిన సీతయుఁ బ్రాణ మెడలు
లక్ష్మణుండును జూడ నాఁస్స ముడిగి, తెగును నల్లనఁ గార్యంబు తెఱఁగువప్పు.

చ. అని పవనాత్మజుండు దివిజారిపయిం దెగ వేళ కాదు భూ
తనయకు నాడురాక వసుధావరు మేలు సెయుంగఁ జెప్పె మీఁ
దను మఱి చూత మంచు నుచితస్థితి నూరక యుండె నప్పుడా
దనుజనిభుండు వోయె నిజధామముఁ జేర సతీసమేతుఁడై. 83

వ. అప్పుడు యామినీచరకామినులు రావణానుమతంబున ననేకవిధంబులగు మధురా
లాపంబుల మిథిలాధీశు కుమారిం గుఱించి బోధించి కార్యంబు సాధింపనోపక
యలసి యుంటం జేసి యొక్కింతసేపు నిద్రించుచుండ మేల్కొని త్రిజట యను
నిశాచరి యిట్లనియె. 84

మ. కలఁ గంటిన్ వినుఁ డింతులార! మన లంకాద్వీప మీయబ్ధిలో
పల వ్రాలన్ మనరావణేశ్వరుని శుంభద్రత్నకోటీరముల్
కలనన్ గూల రఘూద్వహుం డెలమితో గంధద్విపం బెక్కి యు
జ్జ్వలకాంతిన్ విలసిల్లు సీతఁ గొనిపోవన్ మిన్న కేనిప్పుడే. 85

క. శుద్ధాత్ముఁ డైన రాముఁడు, శుద్ధాంతపుదేవిఁ గానశుభసూచకముల్
శుద్ధ మయితోఁచుచున్నవి, సిద్ధం బీమాట వేద సిద్ధాంతముగాన్. 86

క. కావున నిక్కొ_మలిరొండ, గావలి యున్నట్టిమీరు కఠినోక్తులుగా
నేవిము నాడను డిక నీ, దేవియ రక్షింప మనకు దిక్కగు మీదన్. 87

వ. అని చెప్పి మఱియును. 88

క. అమ్మా వెఱవకు మదిలో, నిమ్ముగ మఱి వేడ్కనుండు మిక నీమగడున్
నెమ్మిగ నినుఁ గొని పోవును, మమ్మందఱ మునుపు మమ్మ మఱవక కరుణన్. 89

గీ. అనుచు దనుజకాంత లంతంత నెడఁబాసి, నిదుర వోయి రంత నదరి సీత
తనకు దిక్కు లేమిఁ దలపోసి దుఃఖింపఁ, బవనసుతుఁడు మనుజభాషఁ బలికె. 90

క. ఉన్నాఁడు నీదు రాఘవుఁ, డున్నాఁ డిదె కపులఁ గూడి యురుగతి రానై
యున్నాఁడు నిన్నుఁ గొని పో, నున్నాఁ డిది నిజము నమ్ము ముర్వీ తనయా. 91

సీ. ఆమాట లాలించి భూమిజ తనలోన, వెఱఁ గంది శింశపావృక్ష మరసి
చూడంగ నప్పుడు సూక్ష్మరూపంబున, నొడిక నా శాఖల నడుమ నున్న
కపికుమారుని రూప మపురూపముగఁ జూచి, స్వాంతంబులోన హర్షంబు నొంది
దనుజమాయలచేతఁ దఱచు వేగుటఁ జేసి, మాటాడ నేరక యూరకున్న

గీ. భావమూహించి తన్ను నాదేవి యాత్మ, నమ్మకుండుట తెలిసి యాశాఖమీఁది
నుండి క్రిందికి లంఘించి నిండుభక్తి, మ్రొక్కి నిలుచుండి కరములు మోడ్చిపలికె.

ఉ. తమ్మునిగూడి పుణ్యగుణధాముఁడు రాముఁడు వచ్చి మాల్యవం
తమ్మున సైన్యసంఘము ముదంబునఁ గొల్వఁగనుండి భూమిపై
మిమ్ములఁజూచి రండనుచు మేటికపీంద్రుల బుచ్చి యందు మొ
త్తమ్ముగ మమ్ముఁ గొండఱను దక్షిణభాగముచూడఁ బంపుచున్. 93

క. ఆంగనఁ బొడగని నీవి, య్యంగుళి గడుఁ జాలఁ జూడ వంచును నాచే
నుంగర మంపెను రఘుపుంగవుఁ డిదె కొమ్మటంచు భూమిజకిచ్చెన్. 94

ఉ. ఇచ్చినఁ జూచి రామునధరిణీశ్వరుముద్రికగా నెఱింగి తా
నిచ్చను మెచ్చి యాతువలనే క్షణ యాత్మగతంబునందు నీ
విచ్చినదాసిభావమును వల్లభుచందము నేర్పడంగ నేఁ
జెచ్చెర నంతయుం దెలియఁ జెప్పుము నమ్మిక పుట్టునట్లుగన్. 95

వ. అని విచారించి యిట్లనియె. 96

క. నిను విశ్వసింపఁ జాలను, వినుమింపుమ నీ తెఱంగు విభునివిధము నా
కనవుడు బాపని తెలియఁగ, వినయంబున విన్నవించె విస్ఫుటఫణితిన్. 97

క. నానాఘనరోమ మకరసు, ధీనిధి! నీనెళ యింటి తెలియఁగ నైనన్
నీనిజరూపము చూడఁగ, నేనాకన్నంబు నమ్మికీయుఁజుమీ. 105

వ. అనుటయు నాహనుమంతుండు 106

క. చుక్కలు శిరఃపుష్పములుకా, నక్కజముగ మేను వెంచి యంబరవీధిన్
వెక్కసమై మారుతి, నకోర్మలి ముదము నొందె నాకృతిగాన్. 107

వ. ఇట్లు తన మహోన్నతరూపంబు చూపి యెప్పటియట్ల మరల సూక్ష్మరూపంబును గైకొని నమస్కరించిన యాహనుమంతునకు నద్దేవి తనశిరోరత్నంబు నొసఁగి ప్రీతిఁ బ్రోది
యిట్లనియె. 108

చ. రఘుకులవార్ధిచంద్రుఁ డగురాముని క్షేమము చాల నింటిరా
విధినము లైనపాట్లు పృథివీపతికిన్ దగఁ జెప్పఁగల్గె నే
డనిశభంగి నీవలన నచ్చుగ నేయుపకార మేమియున్
దలఁచి యొనర్పలేను వసుధాస్థలి వర్ధిలు బ్రహ్మకల్పముల్. 109

వ. ఇట్లు దీవించి మఱియును. 110

క. ఏరోజుఁ జూచిన ధరణీ, నాయను శ్రీపాదయుగము నాచిత్తములోఁ
బాయకని విన్నవింపుము, వాయుసుతుండుండ పుణ్యవంతుఁడ తెలియన్. 111

గీ. ఇప్పుడు రావణుఁ డేతెంచి కపటబుద్ధి, గర్వమునఁ జేసి నన్నెన్ని కాఱు లాడె
నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు, పతికి దయ పుట్టఁగా విన్నపంబుసేయు

సీ. నిమ్మపవెన్నెల వేణి జడలుగా సవరించి, మలినజీర్ణాంబరం బొలియఁ గట్టి
భూమిజాజంబు భూమిఫూరంటగఁ బూసి, తనదివ్యమూర్తిఁ జిత్తమున నిల్పి
నిశ్చలస్థితితోడ నిలిచి ధూమ్రాక్షయ్యను, బాళించి నిదుర యేప్పుడుఁగ విడచి
తారక బ్రహ్మమంత్రంబుఁ బఠింపుచుఁ, గినరాక్షస దుష్టమృగములలోన

గీ. సతి లంకాసుహృద్వనగహనసీమఁ, దపము సేయుచు నున్నాను దన్నుఁ గూర్చి
నాకుఁ బ్రత్యక్ష మగునని నాథునకును, విన్నవింపుము సత్త్వసంపన్న నీవు 113

వ. అని చెప్పి మఱియును. 114

చ. జనకువిధంగి రామనృపనందుని నన్ను దల్లిమాఱుగాఁ
గని కొలువంగ నేర్చు గుణాధికుఁడైన లక్ష్మణు నీతిపాంగుస్
వినఁ గనరానిపల్కు లవివేకముచేతను బల్కినట్టి యా
వినుతమహాఫలం బనుభవించితి నంచును జాటి చెప్పుమా. 115

క. ఆమాటలు మది నుంచక, నామానముఁ గావు మనుచు నయవినయగుణో
ద్దాముఁడు రాముని తమ్ముఁడు, సౌమిత్రికిఁ జెప్పవయ్య సాహసివర్యా! 116

వ. అని యిట్లు జనకరాజతనయ పలికినపలుకు లాలకించి హనుమంతుం డాజననితో నిట్లనియె. 117

క. ఇనుఁ డుదయింపకమున్నే, వననిధి లంఘించి మనుజవల్లభుకడకున్
నినుఁ గొనిపోయెద వీఁపున, జననీ! కూర్చుండు మనిన సంతోషమునన్. 118

క. నీ వంతవాఁడ వగుదువు, నీవెంటనె వత్తునేని నెగడవు కీర్తుల్
రావణునికన్న మిక్కిలి, భూవరుఁడే దొంగ యండ్రు బుధనుతచరితా. 119

వ. అదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటుదానం గాను గావున నీతో రాఁదగదు. మఱియును. 120

క. దొంగిలి తెచ్చినదైత్యుని, సంగడు లగువాని వారం సాహస మొప్పన్
సంగరముఖమునఁ జంపక, దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్. 121

వ. మఱియు రామచంద్రుండు త్రిజగదేకవీరుండును గోదండదీక్షాగురుండును రాక్షసకులాంతకుండును నగుటం జేసి రాణివాసద్రోహి యగురావణుని సంగరరంగంబునం బ్రఖ్యాతంబుగాఁ జంపికొనిపోవుట ధర్మంబు. నీవు రామచంద్రునకుఁ బరమభృత్యుండవును బుత్త్రసముండవును నగుటం జేసి నీవెంట నరుగుదెంచుట తప్పు గాకపోయినను బగ తీర్పక వచ్చుటుచితంబుగాదు గావున నీవు రాఘవేశ్వరుల కిన్నియుం దెలియ విన్నపంబు సేసి తడయక తోడ్కొనిరమ్మనిన నద్దేవికి నమస్కరించి హనుమంతుం డిట్లనియె. 122

ఉ. నీవిభుఁ డబ్ధిదాఁటి! ధరణీతలనాథులు సన్నుతింప సు
గ్రీవసుషేణముఖ్యబలబృందముతో నరుదెంచి నీచునిన్
రావణు నాజిలోఁ దునిమి రాజస మొప్పఁగ నిన్నుఁ గొంచు సే
నావళితోడ నీపురికి నారయ నేగు నిజంబు నమ్ముమా. 123

వ. అని విన్నవించి నమ్రుండై యద్దేవిచేత దీవనపొంది మరలి చనుచున్నవాఁడై తన రాక రావణున కెఱుంగఁ జేయవలయునని తలంచి. 124

సీ. మేదిని సమముగా మేడలు గావించి, కేళీగృహంబుల నేలఁ గలిపి
కమలాకరంబులు కలఁచి గారలు వెట్టి, వృక్షజాతంబుల విఱుగఁ దన్ని

పుష్పగుచ్ఛంబులు పుణికి పాఱఁగవైచి, తేనెలు రాల్చి పూఁదేనె లుడిపి
పొదరిండ్లపొదవులు చదియఁగా నగ్గాడి, చప్పరంబుల నేల చదును జేసి
గీ. వనముఁ గాచెడిరాక్షసవరములకు, వీరవరులను నెనిమిదివేలఁ జంప
సీతఁ గాచెడి రాక్షసస్త్రీలు బెదరి, పాఱిపోయిరి రావణుపాలి కంత. 125
వ. ఇట్లు రావణుం జేరి వారు. 126
క. దేవా! నేఁ డొకవఁకఁ, డేవిధమున వచ్చెనాఁడొ యెఱుఁగము సీతా
దేవిఁ గని మాట లాడియుఁ, బోవుచు వనమెల్లఁ జెఱికి ద్రొబ్బిడి కడఁకన్. 127
గీ. వనముఁ గాచెడిరాక్షసవర్గములను, దండి దోకనిని మిడి జోవకుండఁ బట్టి
మేటిభుజశక్తి నందఱఁ గీటడంచిఁ వాలి యున్నాఁడు సాహసవంతుఁ డగుచు.

వ. అని విన్నవించినంతనే క్రోధరక్తాంతలోచనుం డగుచు నవ్వింశతిలోచనుండు విచారించి వాఁడు రాముని పంపున వచ్చినదూత కాఁబోలు వానిం జంపుం డని పదివేల రాక్షసులం బంపిన. 129

క. ఉగ్రాకారుం డగుచు ద, శగ్రీవుం డనుప దనుజసంఘంబులు దా
మాగ్రహమునఁ జనుచు బలో, దగ్రశ్రోత్రాత్ము లగుచుఁ దాఁకిరి కడిదిన్. 130
ఉ. తాఁకిన నంత వాయుజుఁడు తానదలించి కఠోరశేఖతో
వీఁక నెదిర్చి పేర్చి రణవీథి నిశాచరసైన్య మెల్ల నొ
క్కూఁకున వెంట నంటి సముదగ్రబలంబున బాఱఁబాఱఁగాఁ
దోఁకనుజుట్టిమోదె బలుదుర్గములం దునుమాడె నందఱన్. 131
క. అందునఁ జావక మిగిలిన, కొందఱు పఱవెంచి యసురకొల్వున మ్రొక్కో
యందఱ ద్రుంచెను దానవు, లందఱను వీఁడు దారుణాంతకుఁ డగుచున్. 132

వ. అని విన్నవించిన రాక్షసేశ్వరుం డగు రావణుండు మండిపడి పింగళాక్షుని దీర్ఘజిహ్వుని నష్మవక్షుని శార్దూలముఖుని వక్రనాసుని బనిచిన వారును దమతమబలంబులం గూడికొని రథారూఢులై వచ్చి ఘూర్ణించుచుం దాకి శస్త్రాస్త్రంబు లడరించిన నవియెల్ల లెక్కగొనక యక్కపివరకోడకు దర్పంబునం జేర్చి వాలమల్లార్చి యెదిర్చినబలంబును బలునిడుగాఁ దోలి పింగళాక్షుని ద్రుంచి దీర్ఘజిహ్వుని దీర్ఘనిద

ద్రుంచి వక్రనాసునిఁ బరాక్రమంబున చూర్ణంబు సేసి యమ్మహోదరుని భస్మంబుఁ జేసి శార్దూలముఖుని వధించి విస్ఫురత్పరాక్రముండయిన గర్వించి మరల మకరతోరణంబు నారోహించి యార్చుచున్న సమయంబున, 133

క. చావక మిగిలినదైత్యులు, రావణుకడ కేగి వేగ రాహుత్తులపా
ట్లావాయుజు సాహసమును, వేషముఁ జెప్ప నతఁడు విస్మయమందుచున్. 134

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్షణములం గ్రోధానలజ్వాలలు
త్కటమై మెఱవఁగ మంత్రిపుత్రుల మహోగర్వాఢ్యులం బంపఁగన్
బటుబాహాబలు లార్వురం బనిచె నుద్యద్విక్రమాటోపమ
ర్కటుఁ బారీంద్రుమీఁద నుద్దిడి సంగ్రామంబు గావింపఁగన్. 135

వ. ఇట్లు పనిచిన నాయార్వురును. 136

సీ. శతకోటివిక్రమప్రతిమానుఁ డైనట్టి శతజిహ్వుఁ డత్యంతసాహసుండు
క్రోధానలాఖిలశోషహీ డైనట్టి రుధిరాక్షుఁ డత్యుగ్రరూపయుతుఁడు
పరసైన్యకాననపావకుం డైనట్టి రక్తరోముఁడు మహారణబలుండు
కఠినశాత్రవలోకగజసింహుఁ డైనట్టి శూలదంష్ట్రుఁడు లయకాలయముఁడు
గీ. వ్యాఘ్రకబళుఁడు ప్రసుతవైరిజయుఁడు, ప్రళయశాత్రవుఁడు సాహసోదారబలుఁడు
వీర లార్వురు నత్యుగ్రవేషములను, రూఢి వెడలి ఘనరణారూఢు లగుచు. 137

క. తమతమవిరుదులు దెలుపుచు, దమకంబున వెడలి రధిక తంత్రముఁ గొలుపన్
ఘుమఘుమభేరీరవసం, భ్రమములతో మంత్రిసుతులు పావనిమీఁదన్. 138

వ. ఇట్లు గదిసి సింహనాదంబు లంబరంబునం జెలంగ గజతురంగ శతాంగసుభటనికరంబులుం గూడి శస్త్రాస్త్రంబులం బొదివిన. 139

గీ. వాల మల్లార్చి బ్రహ్మాండగోళ మెల్లఁ, బగల నార్చుచు భుజయుగం బప్పళించి
రణము సేయంగ మకరతోరణము డిగ్గి, వారిని జెక్కొన హనుమంతుఁ డంత

సీ. ఒక్కొక్కరథముతో నొక్కొక్కరథమును, ఘనతాటనంబుగా విఱుగఁ గొట్టి
యొక్కొక్కగజముతో నొక్కొక్కగజమును, జావ చుట్టఁగఁ బట్టిచావఁ గొట్టి
యొక్కొక్కహయముతో నొక్కొక్కహయమును, గడిమితో నలినలిగాఁగఁ గొట్టి
యొక్కొక్కభటునితో నొక్కొక్కసుభటుని, వడిఁ ద్రిప్పి చెక్కలువాఱఁ గొట్టి
గీ. బాహుబలగర్వమునఁ జొచ్చి ప్రేఁగు మంత్రిసుతుల నార్వుర మడియఁగొట్టి
మకరతోరణమున విక్రమమ్ము మెఱయ, భీకరాకారుఁడై యుండెఁ బెచ్చుపెరిఁగి.

క. అటు చని పొంగని,గని దీ, క్తటములు సెదరంగ నార్చి దండడి భూభృ
త్తటముపయిఁ గురియువర్షో, త్కటధారలరీతి నంపధారలు గురిసెన్. 153

ఉ. వాయుజుఁ డప్పు డంపగమి వాలముఖంబునఁ ద్రుంచెఁ ద్రుంచినన్
వాయుజుమీఁదఁ గ్రమ్మఱ నవార్యబలంబున నేసె నేసినన్
వాయుజుఁ డుగ్రుఁడై తునిమె వానిశరావళి నెల్లఁ బిమ్మటన్
వాయుజు నాటనేసెఁ గడు వాఁడిసరంబుల నక్షుఁ డుద్ధతిన్ 153

వ. ఇట్లేసిన. 155

ఉ. తాలమహీజరాజి విధంబును గూలఁగ మోఁదె మోఁదినన్
నేలఁ బదాతియై నిలిచి నేర్పున వాఁడు శరాళి మారుతిన్
ఫాలము నొంచె నొంచినను బావని మూర్ఛిలి తేఱి దానవున్
దూలఁగ ముష్టిచేఁ బొడిచె దోర్బలశక్తి రణాంగణంబునన్. 156

సీ. పొడిచిన మూర్ఛిల్లి పడిఁ దేఱి దైత్యుండు, గద గొని వైచె వక్షంబు పగుల
వైచిన మారుతి పడి వానిగదఁ బుచ్చు, కొని వానిదేహంబు, నుగియ నేసి
నేసినఁ దనవీఁక నోసరింపక వాఁడు, గగనంబు కెగసె నాక్షణయునందె
వాయుతనూజుండు వదలక తనవెంట, నెగసిన గదఁ గొని యేసె నతని

తే. నతఁడు గదఁ ద్రుంప ఖడ్గాన నతులశక్తి, వాఁడు మారుతితొడలు నొవ్వంగ నడచె:
నంత సోలుచు నాహనూమంతుఁ డెగిరిఁ పట్టుకొని వాని భూపైనిఁ గొట్టి చంపె.

తే. అంత హతశేషు లగువార లరుగుదెంచి, సంభ్రమంబున దానవచక్రవర్తిఁ
గాంచి కొలువెల్ల సందడి గాఁగ నపుడు, బహువిధంబుల హనుమంతుఁ బ్రస్తుతించి.

సీ. అక్షుండు తెగె నశ్మవక్షుండు తెగటాఱె, రక్తరోముఁడు నీల్గె రణములోన
స్తనితహస్తుఁడు ద్రుగ్గె శార్దూలముఖుఁ డీల్గె, గింకరవర్గంబు గీటడంగె
శార్దూలకబళుండు సచ్చె దుర్జయుఁ డేఁగె, శత్రమాయుఁ డొరగెను సమసె వక్ర
నాసుండు మఱి రక్తనాసుండుఁ గడతేఱె, శూలదంష్ట్రుఁడు నేలఁ గూలిపోయె

తే. మడిసె యూపాక్షుఁ డట జంబుమాలితునిఁగెఁ, బింగళాక్షుని పేరంతబిలముసొచ్చె
వనము కావలి రాక్షసవర్గ మడఁగె, దీర్ఘజిహ్వుఁడు నేటితోఁ దీఱిపోయె. 159

వ. అని వేయువేల విన్నవించిన నసురేంద్రుఁడు విని తనమనంబున. 160

మత్తకోకిల. వీని వానరుఁ డంచు నిక్కము విశ్వసింపఁగఁ జెల్ల దీ
దానవావళి మ్రింగఁ బుట్టిన దయ్యమో యటు గాక వై

శ్వానరుం డిటువంటి రూపున వచ్చి నిల్చెనో కాక యీ
మేను గైకొని విష్ణు డీతడు మేటియై చనుదెంచెనో. 161

మత్తకోకిల. కాక యెవర మైన నాగులకుం డిచ్చిన నుబ్బి యీ
నాకవల్లభుఁ డెల్లకాలము నాకు నోడిన భీతిచే
లోకశోకకరం బైన రాక్షసలోక మెల్ల నడంపగా
నీకరాళకుడుంపు నిప్పున యీడ కంపఁగ వచ్చెనో. 162

మత్తకోకిల. కాక తక్కినవార లెవ్వరు గర్వసంపద మీఱఁగా
నాకు భీకొని ధాకతోడ రణంబు సేయఁగ నోపరే
లోకమందిటు క్రోధతు లెక్కడలోఁచు దానవీయుఁడౌ
జోక వీనికిఁ గల్గె నేనియుఁ జూతు పుచ్చుడె సర్వమున్. 163

వ. అని యిట్లనేక ప్రకారంబులఁ జింతించి యక్షకుమారుని దలంచి పలుతెఱంగులఁ
బలవించుచున్న తండ్రిం గాంచి మేఘనాథుం డిట్లనియె

క. దేవతలతోడఁ గూడను, దేవేంద్రుని గెలిచినట్టి దేవరకున్ మీ
కీ వగ పేటికి నేఁటికి, దేవా! చిత్తంబులోన దీనుపంథంగికిన్. 165

క. వానరునిఁ గొండఁ జేసుకఁ,పు నికిఁ జింతింప నేల భుజబలశక్తిన్
వానిం బట్టెదనొండెను, గీ చిఁ గాంచు ఇట్టి తెచ్చెద నంపన్. 166

వ. నాపుడు రాక్షసేశ్వరుం డతనిమాటలకు మనంబుననలరి నీవు పరించిపరచిత్తప్రతాప
పహతారాకనుండవు చాపవిద్యా ప్రవీణుండవు తపోబలసమృద్ధుండవు దేవేంద్రగర్వ
విమర్దనుండవు మత్సమానశౌర్యచాతుర్యధుర్యుండవుఁ గావున నీకసాధ్యం బగు
కార్యం బెద్దియున్ లేదు, నీ విపుడపోయి వానిని సాధించి రమ్మని పంచిన. 167

సీ. మాణిక్యతపనీయమయపుపమానముతోడఁ, గుంబట్టు బిరుదు టెక్కెంబుతోడ
సరి చెప్పఁగా రాని శస్త్రాస్త్రములతోడ. బల మైనదివ్యచాపంబుతోడ
సాహసకోవిదుం డైనసారథితోడ, ఘనసత్త్వజవతురంగములతోడ
నుగపట్టి దిక్కుల గగనయానముతోడ, బాలసూర్యోదయ ప్రభలతోడ

గీ. గరము విలసిల్లురథ మెక్కి గంధనాగ, తురగరథభట వందిసందోహపటహ
శంఖకాహళదుందుభిధ్వనము లొలయ, మేఘనాథుండు హనుమంతు మీఁద వెడలె.

లయగ్రాహి.

పెక్కులగుగుజ్జులుఁ జొక్కపురవంబులను
నెక్కువగు నేనుఁగులఁ గ్రిక్కిరిసి రాఁగా

రక్కసులు నేరి యిరుప్రక్కలను గొల్వఁగను
నుక్కునను మీఱి చన మెక్కుడుగ నంతన్
గ్రక్కదల భూతలము చుక్క మొగిరాల శిల
లుక్కసిలి నాదములు పిక్కటిలి మ్రోయన్
డెక్కెముల మించి జవ మొక్కుడుగఁ జూపుదళ
మక్కజముగా నడువ దిక్కులు వడంకన్. 169

ప. ఇట్లు భయంకరాకారంబున వెడలి కంఠహుంకృతులును ఖేభాంకృతులును నంబరంబునఁ జెలంగఁ బొంగి చెలరేఁగుచున్న రాక్షససైన్యంబుం గనుంగొని హనుమంతుండు తోరణస్తంభంబుపై నుండి బహుభూతదిగంతరంబుగా భీకరగతి నార్చెన. 170

క. కలఁగిరి దేవగణములు, జలధులు ఘూర్ణిల్లె గిరులు చలనం బొందెన్
జలజాప్తచంద్రు లొరిగిరి, జలధరములు పఱియ లగుచుఁ జదలం బర్వెన్. 171

క. అప్పుడు దానవవీరులు, నిప్పులు వర్షించునట్టి నిశితాస్త్రములన్
గప్పిరి కొండొగవానలఁ, గప్పిన శైలంబు బోలఁ గపివరుమీఁదన్. 172

తే. అంపవర్షంబు తనమీఁద జొంపములుగ, లీలఁ గురియంగ నవియెల్ల లెక్కగొనక
భువికి లంఘించి యప్పు డద్భుతముగాఁగ, వాలమల్లార్చి యొకమహాసాల మెత్తి

తే. తేరులన్నియుఁ గూరాటితేరులుగను, గుఱ్ఱముల నెల్లఁ గావేగుఱ్ఱములుగ
ఏనుఁగుల నెల్ల వెడరూపుటేనుఁగులుగ, దళము లన్నియు మఱి హతదళముగాఁగ.

ప. ఇట్లు సమయింపఁ జూచి బలంబుపై కుఱికి. 175

సీ. కరియూథములమీఁదఁ గడిసి మాదంతుల, తోఁడఁ గూడఁగ బట్టి తునియఁ గొట్టి
గుఱ్ఱంపుఁబౌజులకును దాఁటి రౌతులఁ, గలయంగఁ బట్టి చెక్కలుగఁ గొట్టి
రథములపైకి నుగ్రంబుగా లంఘించి, రథికులతోఁ గూడ రసను గొట్టి
బలములమీఁద నిబ్బరముగాఁ గుప్పించి, వాలముఖంబునఁ దూలఁ గొట్టి

తే. పటహనిస్సాణకాహళపటిమ లుడియఁ, ద్రొక్కిశస్త్రాస్త్రనిచయముల్ తుమురుచేసి
ఛత్రములఁ ద్రుంచి పడగఁ సత్త్వ మణఁచి పవనసూనుండు సాహసప్రౌఢి మెఱసె.

ప. అట్టి సమయంబున. 177

చ. అనలమురీతి మండి దివిజారితనూజుఁడు తేరు దోలి య
య్యనిలతనూజు నేసె వివిధాయుధపంక్తుల వాని నెల్లఁ దు

త్రుటిమాలు సేసె వాయుజుఁడు దోర్బలశక్తిని దైత్యుఁ డేమఁ దోఁ
కను దుమమాడె వాలివిశిఖంబులనన్నిటి వాయుసూనుఁడున్. 178

క. గిరులును వందలకొలఁదిగఁ, దరువులు నేయుంగఁ గినిసి దానవుఁ డంతన్
ధూమమున నసునునె సృ్రచెను, శరజాలముచేత నొక్కక్షణమున వానిన్. 179

గీ. గంధవహపుత్త్రుఁ డప్పు డాగ్రహము మీఁద, రథముఁ గూలంగఁ దన్ని సారథిని మిమి
గురములఁ జంపి దేనువుఁ గూల నడప, మేసు రావణసుతుఁడు కినిసి నమీరసుతుని. 180

వ. అహంకారంబునఁ బ్రతిఘటించి. 181

క. వాయవ్యాస్త్రము నంతట, వాయుజుమీఁదికి నతండు పడి నేసిన నా
వాయవ్యాస్త్రముఁ దూలెను, వాయుజుని జంప నోడి వానికరుణన్. 182

వ. అది వృథ యగుటం గని మఱియును. 183

క. రౌద్రిం బడరంగ నేసెను, రౌద్రాస్త్రం బనిలిమీఁద రూఢిగ నతఁ డా
రుద్రునియంశం బగుటను, రౌద్రాస్త్రముఁ దేలిపోయె రథశం బొప్పన్. 184

వ. అమ్మహాస్త్రంబు గూడఁ దప్పిపోవుట కాశ్చర్యంబు నొంది యింద్రజిత్తు మఱియును

క. సురఖచరయక్షకిన్నర, గరుడోరగ సిద్ధసాధ్యగంధర్వగణం
బరువంది మోడ్చఁగ ని, ర్భరముష్టిం దొడిగి యేసె బ్రహ్మాస్త్రంబున్. 186

వ. అట్టి యవసరమున. 187

క. సప్తాంభోధులుఁ గలఁగెను, సప్తద్వీపములు వణఁకె శైలము లదరెన్
సప్తానిలములుఁ దలఁకెను, సప్తాశ్వుఁడు మ్రాన్పడియె జగములు గదలెన్. 188

వ. ఇట్లు నేకప్రకారంబులఁ గాలాగ్ని తెఱంగున వెలిమిసుంగుఋఋ చెదరి పడఁగ బ్రహ్మాండమండలంబుం బట్టుకొనినట్లు పెనుమంట లుప్పరం బెగయ నేతెంచు బ్రహ్మాస్త్రముం గని హనుమంతుండు తనమనంబున. 189

ఆ. తనకుఁ జిన్ననాఁడు దమ్ము నేసినటువంటి, వనజభవుని జేతి వరముఁ దలఁచి
బ్రహ్మమంత్రముగ్ర పరికింప నగ్గి, చంప కతనిఁ గట్టివైచె నవనిమీఁద. 190

వ. ఇట్లు కట్టుపడినకరుచనిపట్టి జూచి రావణాసురునిపట్టి తనలో నిట్లు లనుకొనియె. 191

క. ఈబ్రహ్మాస్త్రము తాఁకుట, కేబలియుండు బ్రదుక నోపఁ డీతఁడు ఘనుఁడౌ
నీబాహుబలిని గట్టుట, నాబలిమికిఁ దోడ్పడ కాదె నాకులు మెచ్చన్. 192

క. పెక్కండ్రు దనుజవీరులఁ, జక్కాడినవీనిఁ బట్టి సాహసముగ మా
రక్కసుల యేలియొద్దకుఁ, జక్కఁగఁ గొనిపోవు టదియు చందపుట గాదే. 193

చ. అని తన సత్త్వసంపద రయంబునఁ బొంగుచు మేఘనాథుఁ డ
య్యనిలజుఁ గాంచు నేఁగె దివిజారిసభాస్థలి కద్భుతంబుగా
ఘనరథవాజిఘోటకనికాయభటావళి శస్త్రదీప్త కే
తనవరశంఖకాహళవితానరవంబులు మిన్ను ముట్టఁగన్. 194

వ. ఇట్లు గొనిపోయి రాక్షసేశ్వరుం డయిన రావణాసురుసమ్ముఖమ్మునం బెట్టినంత నే
గాడుపుపట్టిం గని. 195

క. కుటిలభ్రూకుటినటన, స్ఫుటధూమ విలాసపవనపూత్కృతిజనితో
ద్భటరోషానలకీలా, త్కటనేత్రుం డగుచుఁ బలికెఁ గటము లదురఁగన్. 196

ఉ. ఎవ్వఁడ వోరి నీకు ప్రభు వెవ్వఁడు చెప్పుము నీ విందాఁకటిపై
నివ్వనరాశి దాఁటి యిటు కేగతి వచ్చితి నాదు మేమి నీ
వెవ్వనిప్రాపునం బెఱికి తీవన మంతయుఁ శంక లేక యిం
కెవ్వనిప్రాపునం దునిమి తీసురవైరుల నెల్ల నుగ్రతన్. 197

సీ. అసురవల్లభుభోగ మంతయుఁ జైకొని, వీతిహోత్రుసిరి నీట ముంచి
జముకింకరులను సంహారమొనరించి, రాక్షసాధీశ్వరు శిక్ష సేసి
యంభోధినాథుని గాంభీర్య మణఁగించి, దోర్బలంబున గాలిఁ దూలఁ బెట్టి
విత్తధునిమహావిభవంబుఁ గొల్లాడి, శూలహస్తుని నొక్కమూల కదిమి

గీ. అమరగంధర్వకిన్నరయక్షభుజగ, గరుడగుహ్యకమునిసిద్ధవరుల నెల్ల
బట్టి ముసు వెట్టి సేయించు నట్టివాని, విన్న యంతన గుండెలు ప్రిలవెట్టు. 198

చ. శరనిధి దాఁటి వచ్చుటయు చాలక నాపురిఁ జొచ్చి చొచ్చియున్
వెఱవక బాటవై వనము వేళ్ళకుఁ ద్రుంచితి త్రుంచి క్రమ్మఁగన్
బిరుదపుఁబోల రాక్షసులఁ బెక్కువఁ జంపితి చంపి నెమ్మదిన్
గరకరితోడ నాయెదుర గర్వముతోడుత నిల్చె తద్దిరా. 199

క. ఖండించెద నీచేతులు, తుండించెద నసుము రెంపుతునకలు గాఁగన్
జెండించి నీదుకండలు, వండించెదఁ జముపుతోడ నాచవి గలుగన్. 200

వ. ఇట్లు పట్టరాని కోపంబున నాటోపంబుగాఁ బలుకుచున్న రావణాసురునిం జీకిం
గొనక హనుమంతుం డిట్లనియె. 201

క. ఇనతనయుని వరమంత్రిని. జనపతి యైనట్టిరామచంద్రునిదూతన్
ఘనుఁ డగు వాయుకుమారుఁడ, హనుమంతుం డండ్రు నన్ను నార్యులు దిశలన్.

క. రామునిపంపున వచ్చితి, రామునిసేమంబు నీకు రంజిల్లెడిమా
రామునిసతి కెఱిగించితి, రామునికడ కేగుమాడి రాజసవృత్తిన్. 203

క. నారాక మీకుఁ దెలియఁగ, వీరంబున వనము కలఁచి పెఱికితిశక్తిన్
ఘోరాజి నాకు నెదిరిన, వారలఁ బంపితిని యమునిపట్టము చూడన్. 204

క. నినుఁ జూచి తిరిగి పోయెను, మనమున మఱి కట్టఁబడితి మనుజాసన నీ
యను వెల్లఁ గంటి నింకను, వినుమా నాబుద్ధిఁ దెలియ వినయముతోడన్. 205

చ. ఘనుఁడవు నీతిమంతుఁడవు కార్య మెఱుంగుదు సాహసంబునన్
నిను గెదిరించి పోరుటకు నిర్జరవల్లభుఁ డోపలేఁడు నీ
వనిన జగత్త్రయం బదుకు నద్భుతరూపము సెప్పరాదు నీ
యనుపమభోగసంపదల కాఁపడి తెచ్చితి నిప్డు రావణా. 206

క. కడ లేనిజలము ధరణి, క్కడ లేనిమహోఘంబు కపితురగంబుల్
కడ గానరానిసంపద, చెడకుండగ నీకు బుద్ధి సెప్పెద వినుమా. 107

సీ. కుదియించి సింహంబుకోరలు పెఱుకంగ, శేషాహిదౌడలు చీల్చివేయఁ
బిడించి దంభోళిఁ బిడికిటఁ బట్టంగఁ, గఱకంఠుశూలంబు కడిఁ గొనంగఁ
జెలఁగి బ్రహ్మాండమ్ము చిప్పలూడఁగఁ దన్న, హంకారమున బడబాగ్ని నుఱుక
నంభోనిధానంబు లరచేత నడవంగ, గిరి వర్గములఁ దలక్రిందు చేయఁ
తే. గలమహాబాహుసత్త్వవిఖ్యాతనిపుణ, చండభుజదండసాహసోద్దండవిజయ
కాలరుద్రావతారసంగ్రామభీమ, పూర్ణసంతులు కపులు సత్కీర్తియుతులు. 208

వ. అదియునుంగాక దశరథరాజనందనుండును గౌసల్యాగర్భసంభవుండును దాటకా
ప్రాణాపహారుండును విశ్వామిత్రయాగరక్షకుండును నహల్యాశాపమోక్షదీక్షా
గురుండును హరకోదండభంజనుండును జామదగ్ని బాహుబలభంగుండును విరాధ
నిరోధుండును ఖరదూషణత్రిశిరశ్ఛేదనుండును మాయామృగసంచారిమారీచసంహార
కుండును గబంధాంతకుండును వాలిప్రాణాపహారుండును సుగ్రీవరాజ్యసంస్థాపన
పరమాచార్యుండును ధనుర్విద్యాప్రవీణుండును నమోఘబాణుండును రాక్షసకులాం
తకుండును గామితస్థాన్వమాంభోనిధి చంద్రుండును గరుణాసింధుండును నగు శ్రీరా
మచంద్రుండు కరుణాలంకారుండు గావున. 209

ఉ. వారక సీతనిచ్చి రఘువల్లభుసన్ శరణంబుఁ జొచ్చినన్
నేరము లెంచి చంపమికి నీయెడ చెప్పుదు నేను బుద్ధిగా

భారపడంగఁ జాలఁడు శుభస్థితి నమ్ముము నమ్మ కూరకే
పోరఁగఁ జూచితేనిఁ బొరిఁ బుచ్చకమానఁడు నిన్ను రావణా. 210

ఉ. నావుడు మండి దైత్యకులనాయకుఁ డుగ్రవిలోకనంబులన్
పావకవిస్ఫులింగములు పైకొని పాఱఁగ వీఁక ఘోరదై
త్యావళిఁ జూచి మీరలు మహావిశిఖంబుల వీనిఁ జంపుఁ డీ
యావల రాముఁ డుల్కుచు భయాకులుఁడై చెడిపోవునట్లుగన్. 211

వ. అనిన విభీషణుం డిట్లనియె. 212

క. దూతపనిఁ బూని వచ్చిన, దూతలు తమనోటి కేమి తోఁచిన నట్లా
పేలను నాథుఁడు రాడిన, దూతలఁ జంపంగఁ దగదు దొరలకు నెందున్. 213

క. కానుఁడిన మీచిత్తము, కాకెల్లను దీఱ ముజ్జగంబులు బెదరన్
దాకకదలించి తోఁకను, పీఁకను ముట్టించి పోవ విడుచుటచాలున్.

వ. అని విన్నవించిన. 2 25

తే. నీతివాక్యసరణి నెఱుఁగుంగ విని రావణేశ్వరుండు కోప మెడలి పలికె
వీనిఁ దోఁక గాల్చి వెడలంగఁ దోలుఁడీ, పాఱిదె యటనుఁ దిరిగి పోవుగాక.

వ. అని యిట్లానతిచ్చిన విని రాత్రించరు లతనిని సభామధ్యంబుననుండి బయటికి వెడలం
గొనిపోయి యొక్కచోట. 211

ఉ. వాలము నిండఁ గోకలు జవంబునఁ గట్టిగఁ జుట్టి వాని పైఁ
దైలము చక్కఁజల్లి చిఱుఁదం జని పౌరులు సూడఁ బావక
జ్వాలదగిల్చి బొబ్బలిడి వాడలఁ ద్రిప్పుచునుండ వా
తూలభవుండు దానికిని దూలక వహ్నిజపంబు సేయఁగన్. 218

గీ. అగ్ని దేవుఁ డప్పు డాత్మలోఁ జింతించి, హితుఁడు నాకు లోకహితుఁడు పవనుఁ
డతనిపుత్త్రుఁడైన హనుమంతునకు నేను, జలువ గూర్తు ననుచుఁ జల్లనయ్యె. 219

వ. అప్పుడచ్చటివృత్తాంతం బంతయుఁ దనకుఁ గాపలియున్న రాక్షసకాంతలవలన విని
చింతాభరాక్రాంతయై జనకరాజనందన కరంబు శోకించి కరంబులు ముకుళించి జగ
ద్ధితకార్యధుర్యుండును రాఘవప్రియానుచరుండును మత్ప్రాణబంధుండును జగత్ప్రా
ణనందనుండును నైన హనుమానునకును శీతలుండవు కమ్మని యగ్ని దేవునకు నమ
స్కరించి యగ్ని మంత్రంబును బ్రహ్మమంత్రంబును నుచ్చరించిన నద్దానిసఁన వాని
వైశ్వానరభగవానుండు సల్లనయ్యె బ్రహ్మాస్త్రబంధనంబును నూడె నట్టిసమయంబున

సీ. కొలువుకూటములకుఁ గుప్పింప గటవాఁజి, శాలలమీఁదికిఁ జౌకళించి
భండారగృహములపైకిని లంఘించి, మెఱుఁగారు మేడలమీఁది కుఱికి
చప్పరంబులమీఁది కుప్పరంబున దాఁటి, యంతఃపురములకు గంతువైచి
చవికెలమీఁదను సాహసంబున వ్రాలి, గరిడికూటంబుల సౌఁది నెక్కి
గీ. వాఁడవాడల వీథుల వన్నె మెఱసి, హనుమఁడు త్రిపురంబు వేల్చినయట్టిలీల
నొక్కగృహమైన లెక్కకు దక్కనీక, దానవేశ్వరుపురము దగ్ధంబు చేసె. 220

శా. అంభోరాశిని వాలవహ్నినతిశైత్యం బొప్పఁ జల్లార్చియ
య్యంభోజానన సీతఁ గాంచి తనవృత్తాంతంబు తెల్లంబుగా
గంభీరధ్వని విన్నవింపుచు నమస్కారంబు గావించి సం
రంభం బొప్పఁగ వేడ్కతోఁ గదలె ధీరప్రౌఢి దీపింపఁగన్. 221

క. పోయెదు వాయుజు నెక్కడఁ, బోయెదు నాచేత ననుచుఁ బోసిక వడిన్
డాయుఁగ వచ్చినలంకిణి, కాయము పగులంగఁ బొడిచెఁ గడువడిఁ గినుకన్. 223

వ. ఇట్లు లంకిణిం జంపి సువేలాచలం బెక్కి సింహనాదంబు చేయుచు. 224

క. వడిగా ధరశృంగంబుల, నడుగులు వడినూఁది త్రొక్కి యద్భుతశక్తిన్
జలరాశి దాఁటఁ బావని, మిడివింటం బసిఁడియుండ మీఁటినరీతిన్. 224

వ. ఇట్లు కుప్పించి యుప్పరం బెగసి వాయువేగంబునం జనుచు నయ్యబ్ధిమధ్యంబున
నున్న సునాభం బను శైలంబునఁ దన దేహంబుదాహంబుఁ దీర్చుకొని సముద్రంబును
దాఁటి యవ్వలికిం జనియె నప్పుడు. 225

ఉ. వచ్చినపావనిం గని జవంబున నంగదుఁ డాదియాకపుల్
గచ్చుల భక్తితో నెదురుగాఁ జన నందఱఁ గౌగలించి వా
రచ్చటి కార్యమంతయుఁ బ్రియంబునఁ దన్నడుగంగఁ బోయి పే
వచ్చినచంద మేర్పడఁగ వారికిఁ జెప్పెను దప్పకుండఁగన్. 226

క. రఘువరుఁ డిచ్చినముద్రిక, రఘువల్లభుదేవి కిచ్చి రభసంబున నా
రఘువరున కానవాలుగ, రఘువల్లభుదేవి చేతిరత్నముఁ గొంటిన్ 227

మ. అని చెప్పన్ వినియంగదాదులు మహాహ్లాదంబునన్ బొంగి పా
వని బాహాబలసత్త్వముల్ పొగడుచున్ వర్ణింపుచున్ వేపునః
పునరాలింగన మాచరింపుచు వడిన్ భూషింపుచున్ మ్రొక్కుచున్
ఘనతం బాడుచు నాడుచున్ బలువిడిన్ గర్వంబునన్ దాఁటుచున్. 228

శా. నేనే చాలుదు రావణాసురుతలల్ నేలం బడం గొట్టఁగా
నేనే చాలుదు వానిపట్టణము మున్నీటం బడం ద్రోయఁగా
నేనే చాలుదు దుష్టదానవతతిన్ నిర్భీతి నెండింపఁగా
నేనే చాలుదు నంచుఁ బంతములు ప్రాన్కిఁ బల్కుచున్ ద్రుళ్ళుచున్. 230

క. ఆరాత్రి కీశు లందఱు, మారుతితోఁ గూడి నిలిచి మఱునాఁ డచటన్
ధీరత దుర్ధరశైలము, చేరఁ జని నిద్ర చేసి చిత్తములలరన్. 231

వ. అమ్మఱునాఁ డునయంబున మధువనంబులోఁ బ్రవేశింప నుద్యోగించి యందఱ కన్నను బెద్దవాఁ డగు జాంబవంతునిం జూచి నీవు శ్రీరామునకు హితుండవు సుగ్రీవునకు మంత్రివి కావున మాకు నొక్కబుద్ధి యానతిమ్ము. ఈకపులు క్షుద్బాధావశంబునం బొరలి మహాశ్రమంబును బొందియున్నవారు గావున సుగ్రీవుని మధువనంబున నుండెడుఫలంబులం బరితృప్తులమయి రామునిసన్నిధానంబున కేగుట లెస్స యని యంగదహనూమంతులు పల్క జాంబవంతుండును నత్యుత్సాహంబున నంగీకరించి కపులం బురస్కరించుకొని మధువనంబులోఁ బ్రవేశించినంత. 232

సీ. ఒక్కఁడాఁకొని కొమ్మలూఁచినఁ బండ్లెల్లఁ, జేకొని తేర భక్షించు నొకఁడు
ఒక్కఁడాఁకొని తేఁపుచున్నట్టి తేనియల్, దడయక గొల్లాడి త్రాగు నొకఁడు
ఒక్కఁడాఁకొని కోయుచున్నట్టి కాయలు, మిన్నక యూటాడి మ్రింగు నొకఁడు
ఒక్కఁడాఁకొని గోళ్ళసాలిచినట్టి పువుళ్ళఁ, బుక్కిళ్ళ కొలఁదిగా బొక్కు నొకఁడు
తే. తరువుపైనుండి తరువుపైఁ దాఁటు నొకఁడు, పండ్లకెట్టునట్టిమ్రాఁకైన బ్రాఁకు నొకఁడు
దిగువఁ గూర్చుండి తరువు కెగురు నొకఁడు, పెద్దపొదవుననుండి కుప్పించు నొకఁడు

ఉ. కాయలవ్రేటులాడుచును గంతులు వైచుచుఁ బూవుఁ గీవలం
దూయలలూఁగుచున్ దరువులూఁపుచుఁ బండ్లను బొట్టనిండఁగా
మేయుచు వెక్కిరింపుచును మిన్నక దాఁటుచు దోఁకలెత్తుచున్
గూయుచు నేలదూఁకుచును గుంపులుగూడి కపీంద్రు లెంతయున్. 234

క. వన మంతఁ గాసి చేయఁగ, వనపాలకు లేగుదెంచి వడిఁ గోపముతో
డను నదలించిన వారల, హనుమంతుఁడు మొదలుగాఁగ నగచరు లెల్లన్. 235

క. మెడఁబట్టి వనములోపల, వెడలఁగ బటు పాఱద్రొబ్బి వెడలుం డన్నన్
దడయక దధిముఖు డనుతను, యొడయనికడ కేగి వార లుగ్రముగాఁగన్. 236

వ. విన్నవించిన యంతనే. 237

చ. దధిముఖుఁ డప్డు మూఁడిపడి తాఁ దనవారలఁ గూడి వచ్చి బ
ల్విధముల సంచరించు కపివీరులఁ గోపముతోడఁ జూచి యీ
మధువన మెల్లఁ గొల్లగొన మర్కటవల్లభునాజ్ఞఁ ద్రోయ మ
మ్మధములఁ జేయ నెంతఘనులంచును బాఱఁగ వారినడ్డగిన్. 238

వ. ఇట్లు దండింపుచున్న దధిముఖుపై నంగదాదివనచరులు గదిసి యుగ్రహంబున. 239

క. కొందఱు చఱచియుఁ బొడిచియుఁ గొందఱు దలపట్టి యీడ్చి కొట్టియుఁ గోల్కన్
గొందఱు వ్రచ్చియుఁ దన్నియుఁ, నందఱు నొప్పింప వార లాగ్రహవృత్తిన్. 240

క. వ్రయ్యలు వాఱఁగ వ్రచ్చినఁ, గ్రియ్యగ రక్తములు గ్రమ్మఁగా పడితోడన్
గుయ్యో మొఱ్ఱోయని వా, రయ్యెడ సుగ్రీవుకడకు నరిగిరి భీతిన్. 241

వ. అరిగి రామలక్ష్మణులం గూడియున్న మిహిరనందనుం గనుంగొని నమస్కరించి మధువనంబునందు జరిగినవృత్తాంతంబంతయు విన్నవించిన వారల నాదరించి సుగ్రీవుం డిట్లనియె, 242

క. దేవరపంపునఁ జని వా, రేవెంట్రన సీతఁ గనిరొ యిటు గాకున్నన్
నావనము పాడు సేయరు, పావని మొదలైనవారు భయవిరహితులై. 243

వ. అని రామభూపాలుండు విన సుగ్రీవుండు వారలనూరార్చి యిట్టిదుండగంబులు వారి కేయుండుం గాని వారలందోడ్కొని యతివేగమ రండని యనిపినం జని యంగద హనుమంతుల గని యవనీశ్వరుం డీక్షణంబున మిమ్మందఱ నచ్చటికి రండని యానతిచ్చెం గావునఁ జెచ్చెరఁ బదుండని తోడ్కొనిపోవునప్పుడు వారల కెదురుగా వానరవీరులఁ గొందఱ ననిపిన వారలంగూడి చనుదెంచి శ్రీరామచంద్రుని పాదారవిందమ్ములకు సాష్టాంగదండప్రణామమ్ము లాచరించి సౌమిత్రికిని వందనమ్ము లొనరించి సుగ్రీవునకు నమస్కరింప తనచేత మేలువార్త విన సంతసింపుచున్న రఘుకులేశ్వరుల తలంపెఱింగి హనుమంతుం డిట్లనియె. 244

శా. కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి న్లంకలోఁ
గంటిన్ మీపదపంకజంబులును నేఁ గౌతూహలం బొప్పఁగాఁ
గంటిన్ మీకరుణావలోకనను విఖ్యాతంబుగాఁ గీర్తులన్
గంటిన్ మాకపివీరబృందములలో గాంభీర్యవారాన్నిధీ. 245

సీ. కట్టినవస్త్రంబు కట్టుకొంగే తక్క, జీర్ణించిపోయిన చీరతోడ
నుడుగనివగలచే నోరంతపొద్దును, జెక్కునఁ జేర్చిన చేయితోడ

బుడమిపైఁ బొరలాడునొదలు బూడిద బ్రుంగి, నిరతంబు దొరఁగుకన్నీటితోడఁ
నిడుద పెన్నెఱివేణి సడలించి జడలతో, నిరతనిరాహారనియతితోడఁ
గీ. గడుక జంకించుదైత్యకామినుల నడుమఁ, దపముఁ జేయుచు దనుజబాధలకు నోర్చి
వనితప్రాణంబుదక్క స్వదేహముఁ ద్యజించి, నిన్ను నెమ్మి మదిలోన నిల్పియుండు

క. జానకిఁ బొడఁగని యనుచు మీ, రానతి నాకిచ్చు పునసట్టిఘంబుల్
నే నాయమ కెఱిఁగించితి, జానకిచిహ్నంబుఁ గొంచుఁ జనుదేఁ గంటిన్. 217

వ. ఇవ్విధంబున సీతచిహ్నంబులు రామచంద్రునకుం జెప్పి దండప్రణామంబు లాచరించి తనకు సీతాదేవి దయచేసిన శిరోరత్నంబు శ్రీరామచంద్రునకు సమర్పించినం జూచి యదియక్కునం జేర్చి యానందబాష్పంబులు గ్రమ్మ దేవ మూర్ఛిల్లి తెప్పిరిల్లి హా! వామలోచన! హా! పద్మగంధి! హా! సీత!! హా! యనుచు శోకించి సుగ్రీవుం జూచి మనము లంకాప్రయాణము చేయఁబోవుదము గాన నీక సేనలం గూర్చుమని యానతిచ్చిన వానరేశ్వరుండు మహాప్రసాదం బని యంగద హనుమజ్జాంబవత్సుషేణ పనస నల నీల గజ గవాక్ష గోముఖాదులగు సేనానాయకుల నఱువదికోట్ల నియోగించిన వారును నొక్కొక్కరు నూఱేసి కోట్లబలంబుతోడ రామచంద్రుని యిరువంకల నాడుచుఁ బాడుచు మాల్యవంతంబు వెడలిరని విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుండట మీఁది వృత్తాంతం బెట్టిదని యడుగుటయు

క. జలజాక్ష! భక్తవత్సల!, జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!, జలజాకరచారుహంస! జానకినాథా.

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురులింగజంగమార్చన వినోద
సిద్ధశైవాచార సంపన్న సూరిజనవిధేయ ఆత్కూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు సుందరకాండము
సర్వము నేకాశ్వాసము.



శ్రీరస్తు

# మొల్లరామాయణము



## యుద్ధకాండము, ప్రథమాశ్వాసము





కామారినుత నామా !
సామీరికృతప్రణామసహస్రకరక్షో
గ్రామా ! పర్జన్యమేను
శ్యామా! సంగ్రామభీమ ! జానకిరామా !

వ, శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకిమునీశ్వరున కెఱింగించిన తెఱంగు వినుపించెద సావధానచిత్తంబులో నాకర్ణించునట్లు శ్రీరామచంద్రుండు వానరసైన్యముతో వెడలి నడుచుచుండ హనుమంతుం డంతకుమున్ను తాను లంకకుం జని మగిడివచ్చి యచ్చటి వృత్తాంతమంతయు శ్రీరామచంద్రున కెఱిగించినయట్టి దోవలో నుబును పోకముగా మరల రావణుండు చందంబును రాక్షసస్త్రీల సంవాదంబును నింద్రజిదతికాయాది కుమారపక్షంబు తెఱంగును గుంభకర్ణ విభీషణాదిసోదరుల యునికియును లంకిణిపొంకం బణంచుటయును లంకలోపలికిం బోయిన చందంబును లంకాపురీదహనంబును సముద్రలంఘనకారణం నదియుదియన నేల తాం జేసివచ్చిన కార్యంబులనెల్ల నెవ రెవ్వరేదేదేయు జగినవారి వృత్తాంతంబు నెఱింగించుచుండ మిగిలినకపులు వినుచుం దమజాతిచేష్టలు చూపుచుం జనుచున్న చందంబున సుగ్రీవుండు రామచంద్రునకుం జూపుచు నడచుచున్న సమయంబున 2

ఉ. కొందఱు మంతనమ్ము లొనరించుచు గొందఱు దిమ్ము రాడుచుం
గొందఱు రామలక్ష్మణులకుం బ్రియనాగతి నాటలాడుచుం
గొందఱు గంతులేయుచును గొందఱు పండ్లిగిలించిచూపు చి
ట్టందరుఁ బోవుచుండిరి దయానిధి రాముఁడు సంతసిల్లఁగన్. 3

సీ. పాదఘట్టనలచేఁ బఱఁగిన పెంధూళి, యాకసమ్మున మేఘమట్లు పర్వ
వీఁకతోఁ దాఁకినవృక్షజాతం బెల్ల, వేన్మడిగొమ్మలు విఱిగి పడగ
బలువడితోఁ బోవు పక్షిజాతమ్ములుఁ, భయముచే నంపంద పాఱుచుండఁ
జూపించి రావణాసురునిసైన్యంబు లిట్లు, వనవాసిచేతను బ్రమందఁగలదు

గీ. అనుచు శ్రీరామునకు మర్కటనయుఁ డిట్లు, సంతసము పుట్టఁ జెప్పుచు సాగి సాగి
క్రమముగా నందఱును గొంతకాలమునకుఁ, దిన్నఁగాఁ జేరిరి సముద్రతీరమునకు. 4

వ. ఇట్లందఱును సముద్రతీరమున విడిసి యున్న సమయంబున హనుమంతుండు బుద్ధిమంత్ర
శ్రేష్ఠుండు గావున శ్రీరామచంద్రునకు నమస్కరించి రావణుండు రాజ్యంబునం బట్ట
భద్రుండై యున్నవాఁడు వానిం జంపి సీతామహాదేవిం దెప్పించుపనికై వేగ మన
మందఱమును సిద్ధులమై యుండవలయు ననవుడు రామచంద్రుండు తమ్మునితో. 5

క. ఈవానరులను దోడ్కొని, ప్రావీణ్యముతోడ వృక్షపర్వతతతులన్
వేవేగమె తెప్పింపుము, పోవుద మటమీఁద వైరిపురముం జేరన్. 6

వ. అని యిట్లానతిచ్చి సముద్రతరణోపాయం బాలోచించుచుండె నంత, 7

సీ. అక్కడ రావణుం డఖిలమంత్రుల పేర, రావించి తగువారలకు ననియె
మంత్రిసత్తములార! మర్కటుం డొకఁ డేగు, దెంచి మనందఱం గొంచెపఱచి
రాక్షసవీరుల రణభూమిఁ బొలియించి, వనమంతఁ జెకలించి వార్ధి దాఁటి
పోయెను బోరానిపోకలఁ బోవుచు, వాఁడు శ్రీరామునివద్ద కేగి

గీ. ఏమి చెప్పెనో యామీఁద నామనుష్యు, లిద్దఱును వానరులఁ గూడి యేపుమీఱ
వచ్చి లంకాపురముఁ జొచ్చి వారి నెల్ల, నేమొనర్తురో యిపుడు నా కేమి దారి. 8

వ. అని యిట్లు రావణుండు నిండు పేరోలగంబునఁ గూర్చుండి డోలాయమానమానసుండై
విచారించుచుండ నాసమయంబున విభీషణుండు సాయంసంధ్యావిధిం దీర్చుకొని తన
మంత్రులుం దానును గొల్వుకూటంబున కేతెంచి పెద్దగద్దెపైఁ గొలువున్న యన్నకు
సాష్టాంగదండప్రణామంబు లాచరించిననతండును సంతోషించి యనుజునకు నర్హా
పీఠంబు జూపిన నాసీనుండై యన్న కిట్లనియె, 9

గీ. అవధరింపుము దేవ మహానుభావ, మనపురమ్మునఁ బ్రకృతమ్ము చను తెఱంగు
విన్నవించెద నున్నది యున్న యట్టు, కొంచె మవధానముగ నాలకించుమయ్య. 10

సీ. అన్నంబు నీరును నక్కఱ లేకుండ. భటు లందఱును దుఃఖపడుదు రయ్య
కంబాలఁ గట్టినగజబృంద మెల్లను, జవసత్త్వములు దూలి జడిసె నయ్య

హర్షంబుతోఁ దుత హయజాతమంతయు, మెడలెత్తుకొని వేడ్క మెలఁగ వయ్య
ప్రజ్వలించుచు నున్న ప్రతిహోమకుండంబుఁ, బొగలు గ్రమ్ముచు నాఱిపోవునయ్య

గీ. ఇట్టియపశకునములఁ గన్పట్టుచుయ్యె, సకలశాస్త్రంబు లెఱిఁగిన జాణవయ్య
యింపుగాఁ జెప్పుచుండి నాలింపు మయ్య. వేగ రామునిసతి నిచ్చివేయుమయ్య. 11

క. సీతను దెచ్చుట మొదలుగ, నీతో నయవాక్యములను నేఁ జెప్పితి నీ
చేతమునఁ బెట్టవైతివి, ఖ్యాతిగ నిఁకనైన సీత నాతని కిమ్మా. 12

వ. అదియునుం గాక మొన్న రాత్రి సీతయొద్దఁ గావలి యున్న రాక్షసకాంతలందరును నిద్రించుచున్న సమయంబునఁ ద్రిజట దిగ్గన మేల్కాంచి నిద్రించుచున్న స్త్రీల నులేపి చెప్పిన దుస్స్వప్నంబు విన్నవించెద నాకర్ణింపుము. రామచంద్రుండు మన లంకపైవచ్చి విడిసినట్లును నీవును గుంభకర్ణుండును దక్షిణాభిముఖులై గార్దభంబులపై నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును నింద్రజిదాదికుమారవర్గంబును సైన్యంబును మూలబలంబును సర్వంబును నశించిపోవుచున్నట్లును సీతం జేకొని శ్రీరామచంద్రుం డయోధ్యకుఁ బోవుచున్నట్లును గలగన్నదఁట. త్రిజటకల నిక్కంబై తోఁచెడిని. రాఘవుండు వానరసైన్యంబుతోఁ గూడి సముద్రతీరంబునకు వచ్చియున్నాఁడని చారులు విన్నవించిరి. ఆరాముని దూతలు మరల వచ్చుటకు రాకముందే శ్రీరామచంద్రునకు సబహుమానంబుగా సీత నర్పించుటయె లెస్స కార్యము. ఇంత చెప్పనేల మొన్న నొక్కకూఁత వానరవేషంబున వచ్చి తన పరాక్రమంబు నీకును బరివారమునకును నెఱింగించిపోయె నది గురుతుంచుకొమ్ము. అని యిట్లు నీతి చెప్పి తమ్మునిపైఁ గోపించి దిగ్గన కోలాహలకూటంబు విడిచి యంతఃపురమునకుఁ బోయె నాసమయంబున నాసభలోనివారందరును దమతమమందిరంబుల కరిగిరి. 13

క. మరునాఁ డెప్పటియట్లనె, సురుచిరముగఁ గొలువుసేయఁ బోష్యంబుగ ని
ద్దురఁ బోవుకుంభకర్ణుఁడు, సరిగా మేలుకొని వచ్చెసభకుఁ బిల్వఁగ. 15

వ. ఇట్లు వచ్చి గృహప్రవేశంబుఁ జేసి స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని భుజియించి మంత్రులతో నన్నకొలువునకుఁ జనుచుండు కుంభకర్ణునితో మరల విభీషణుండును మంత్రిసహితుండై వచ్చెను. అనుజు లిద్దఱును వచ్చి నమస్కరించిన దీవించి క్షేమం బడిగి యుచితాసనంబులం గూర్చుండ నియోగించినఁ గుంభకర్ణుం డత్యంతమును నాసన్నుండై కూర్చుండెను. కొంచెము దూరములోఁ గూర్చుండియున్న విభీషణుండు మరల నన్నతో నిట్లనియె. 15

సీ. దశరథరాముండు తనపత్నిఁ గోల్పోయి, వానరావళిఁ గూడి వచ్చి యిప్పు
డదె చూడు మంభోధి యావలి యొడ్డునఁ, గపిబలంబులతోడఁ గలసియుండె
రాముని సత్త్వంబు రమణిచే మున్వింటి, యతనితమ్ముండును నట్టివాఁడంట
పోరెడి వారికిఁ బ్రాపు సుగ్రీవుఁ డున్నాఁడుఁ వార్ధి నిన్ ముంచినవానితమ్ముఁ
గీ. ఆతఁ డిట వచ్చి నిన్ను నుగ్గాడి కాని, సీతఁ దే నని పంతంబు చేసెనంట
వలదు వైరమ్ము సీత నీవలయు వేగ, నతని నని గెల్వఁగాఁ జాల రమరవరులు. 16
గీ. రాము గెలువంగ వచ్చునే రాజసమున, సీత నర్పించి తత్పదాబ్జాతములకు
నర్థిఁ బ్రణమిల్లి శరణన్న నతఁడె కాచు, సత్యసంధుండు సత్కృపాసాంద్రుఁ డతఁడు.
గీ. చంప వచ్చినట్టి శత్రుఁడైనను, శరణు చొచ్చినంత సదయుఁ డగుచు
నభయ మిచ్చి కాచు టాతనిబిరుదంటఁ సీత నిచ్చి రాముఁ జేరి బ్రదుకు. 18
వ. అనిన విని యారావణుండు కటకటంబడి విభీషణునితో రోషభీషణంబుగా
నిట్లనియె. 19
గీ. నీవు నాదాయతోఁ గూడి నీచబుద్ధి! బుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు
కడగి నీమంత్రులును నీవుఁ గంటిలోని. నెరసు సరవిగ నువ్వారు నిశ్చయముగ. 20
గీ. నాకుఁ దమ్ముఁడ వయ్యు ననార్యముగను, నాదుశత్రులఁ బొగడుచు నాకు బుద్ధి
సెప్ప వచ్చితి వౌరౌర సిగ్గులేక, యిచ్చవర్తింపఁ జుండు టిదేమి పరిర. 21
వ. అనిన విభీషణుం డన్న కిట్లనియె. 22
తే. నిన్నుఁ జంపంగఁ దలపోసి నీమిమంత్రి, వరులు గాచుచు నున్నారు వలదు గోత్ర
కలహ మీచెనుబుద్ధి యేకరణిన జెప్పె నన్న! యింకొకానొకమాట యాలకించు. 23
వ. రామచంద్రుం డాదినారాయణుండు సీత యాదిలక్ష్మి వానరబలంబు బృందారక
సందోహంబు గావున నీ వా రామచంద్రున కెదిరి జయంబు గొనుట కడింది కార్యం
బు నేఁ జెప్పినబుద్ధి విని వేగ నారాముని శరణు చొచ్చియును సుఖంబుగ మనుము.
అని విన్నవించినహితవచనంబులు రోగికిఁ బథ్యాహారంబు రుచింపని పోలికను వీనుల
కసహ్యంబులై యుండ రావణుండు మండిపడి యిట్లనియె. 24
సీ. పటువిషం బొలికించు పాముతో నైనఁ, జెలఁగి యింపుగఁ జెల్మి సేయవచ్చుఁ
గానిశత్రుల నెప్డుఁ గైవారములు సేయు, వానిఁ దనప్రాణబంధు నైనఁ
జేరఁ దీసినయేనిఁ జేటువాటిల్లును, గావున వీని బల్గవ్వ మఱఁతు
విను కుంభకర్ణ! నీవును రాక మునుపు నీ, చెడుగు నాకును బుద్ధి చెప్పఁబూనె

గీ. ననుచు హుంకరించి యవ్విభీషణుఁ బట్టి, వేగఁ గత్తిని బూని వ్రేయఁ బోవ
నట ప్రహస్తుఁ డప్పు డడ్డమ్ముగా వచ్చి, దేవ నీకుఁ దగునె యావిషంబు. 25

క. నీ కేల యింత కోపము, నీకు హితముఁ జెప్పుచున్న నీతమ్ముని నీ
వేకత్తి వ్రేసి చంపిన, లోకులు నిను మెత్తురయ్య లోకస్తుత్యా. 26

గీ. గుణయుతుండైన మనవిభీషణుఁడు లేరి, లంక యేటికి సైన్యంబు లింక నేల
వైభవం బేల యామీఁదఁ బ్రాణ మేల, శాంత మవధారు దేవ నీ స్వాంతమందు

వ. అని ప్రహస్తుండు రావణుకోపంబును గొంతశాంతపఱిచె నప్పు డన్నకోపంబునకు 1
దమ్ముఁడు కుంభకర్ణుండు వడవడ వడఁకి యన్న కెదురాడ నోపక తమ్మునిఁ గావన
లేక గద్దియమీఁదఁ గూర్చుండి యున్న యన్నకు మ్రొక్కి నిజగృహంబునకుం
జనియె నట విభీషణుం డన్నం జూచి యోరీ నీవు విశ్వాసఘాతకుండవు స్వామిఁ
ద్రోహివిఁ గావున నీవు నాకొక్క పేదనరునిఁ బెద్దఁజేసి చెప్పెద వాతఁ డెట్టివాఁడు
వశాలియేని నీవాతనిం జేరి సుఖంబున బ్రతుకు మనిన నతం డిట్లనియె. 28

సీ. విను రాక్షసేశ్వర విష్ణుసన్నిభుఁడు రా, ముండు హా! పేదనరుండె నీకు
నలనిసత్యస్థితి యతనిపరాక్రమం, బిపుడు నీ కెఱుఁగంగ నెట్టు లగును
అవనీశుబాణంబు లతిరయంబున వచ్చి, దండించు నపుడైనఁ దలఁచు నన్నుఁ
బర్వతశిఖరముల్ పడినట్లు నీతల, లిలఁ గూలునపుడైనఁ దలఁచు నన్నుఁ

గీ. నీకుఁ దమ్ముండ నౌటచే నీవు బ్రతుకు, కొఱకుఁ జెప్పిన నీకింత కోపమేల
వినుము నామాట సీత నర్పించి యతని, శరణు వేఁడుము వలదు నీసాహసమ్ము. 29

వ. అని చెప్పిన హితవచనంబులకు మిక్కిలి కోపాగ్నిదీప్తమానసుండై యాజ్యాహుతిం బ్ర
జ్వరిల్లిన హుతాశనుగతి నిండిపడి పెళపెళ నార్చి గద్దియ మీఁదం గూర్చున్నవి.
భీషణుఁ డవశంబు వగులం దన్నిన నతండు తనకన్నులనుండి దొరఁగుజలకణంబులు
హస్తంబుల దుడిచికొనుచు నలుగురు నిజమంత్రులుం దానును దనతల్లియైన కైకసి
యొద్దకుం జని సాష్టాంగదండప్రణామం బాచరించి యన్న చేసిన దుర్నయం బెఱిం
గించి శరణాగతవత్సలుండైన శ్రీరామచంద్రుని సన్నిధానంబునకుఁ బోవుచున్నాఁడ
నని చెప్పి యాయమ్మయనుమతంబు వడసి దీవనలు గైకొని చని సముద్రతీరంబున
విచారగ్రస్తుండై యున్న శ్రీరామచంద్రునిం గని విభీషణుండు. 30

సీ. భానుకులోత్తంస వందితామరలోక, జానకీనాయక శరణు శరణు
తాటకాప్రాణవిదారణ రఘురామ, సకలలోకాధార శరణు శరణు
దిక్కు నీ వని వచ్చితిని దీనమందార, పరమపూరుష రామ శరణు శరణు

మాతృపితృతాదులమాడ్కి సంరక్షించు, సర్వలోకస్తుతి శరణు శరణు

గీ. రామ వెఱచివాఁడ రక్షించు రక్షించు, మిపుడు నాథ నన్ను మిమ్ము యిమ్ము
చూడు చూడు నిన్నుఁ జొచ్చితి శరణమ్ము, కావు కావు నన్నుఁ గరుణతోడ. 31

వ. అని యివ్విధంబున రామచంద్రునిస్తుతి సేయుచుఁ జేరవచ్చుతఱిని సుగ్రీవుండు శ్రీ
రామచంద్రునిం గని విశ్వాసంబు సూపువాఁడై దేవా వీఁడు రావణునితమ్ముండు వి
భీషణుం డనువాఁడు రాక్షసులు మాయలు సేయుదురు గాన వీనివధియింప నాజ్ఞ
నొసంగు మనిన రామచంద్రుండందులకు సమ్మతింపక యితండెవ్వండైన నేమి శర
ణన్న రావణుని తమ్ముని నే కాదు రావణునైనను గాచెద శరణన వచ్చినవాని ప్రా
ణంబులు కాపాడుట రాజులకుఁ బరమధర్మంబు తొల్లి శిబిచక్రవర్తిరాజ్యంబు సే
యుచుండ నొక్కఖగం బేతెంచి శరణుచొచ్చిన నభయంబిచ్చి తనదేహముగోసి
దానిం దఱుముకొనివచ్చిన డేగ కిచ్చెనట కావున నాతని వాయొద్దకుఁగొని రమ్మన
వుడు సుగ్రీవుండు విభీషణుని దోడ్కొనితెచ్చి శ్రీరామచంద్రుని పాదారవిందము
లపైఁ బడవైచిన నతండు విభీషణునెత్తి యాలింగనంబుచేసి యభయప్రదానం బొ
సఁగి నేఁడుమొదలు నీవు మాకు హితుండవు బంధుండవు నయితివి గావున నిన్ను
మాతమ్ములలో నొకనిఁగాఁ జూచికొనియెదనని నమ్మఁబల్కి విభీషణా యింక వైరి
ప్రభావంబు చెప్పుమనిన దశరథనందనునకు వందనం బాచరించి కరంబులు శిరంబున
ధరియించె యతండిట్లనియె. 32

క. రావణుబలసంస్థితి, యా వీరుని శౌర్యమహిమ యభినుతి సేయుల్
నావశము గాదతం డల, దేవేంద్రుని వెట్టిఁ గొనును దీప్తనరేంద్రా. 33

క. ఒక్కొక్క గవనివాకిట. నొక్కొకయేనూఱుకోటు లుందురు దైత్యుల్
పెక్కురుఁ గావలి యుంచును, దక్కక మఱి యెల్లకడలఁ దానును దిరుగున్. 34

వ. తననుమారవర్గము లక్షయుంబదివేలు వారల కొక్కొక్కరికి లక్షమంది బంట్ల
నేర్పఱిచి యుంచిన వారు లంకవీథులలోఁ గొందఱును నగరుచుట్టును గొందఱును
మఱికొన్నిచోట్ల మఱికొందఱును గుంపుగూడి తిరుగుచుందురు. అయినను బ్రహ్మా
దులకైనను సాధింపవలనుపడని లంకాపట్టణముమీఁ చేత సాధింపఁబడఁగలదు. కావున
మీరు వేవేగ సముద్రునిం బ్రార్థించి సముద్రబంధనంబు సేయవలయు ననిన నంత
మహేంద్రపర్వతంబు డిగ్గి సముద్రప్రాంతంబున విడిసి జాంబవ దంగద సుషేణనీల
మైందాది వనచరవీరులచేత నలుదిక్కులయందుంగల పర్వతంబులును వృక్షంబులును
పాషాణంబులును దెప్పించి కడలి కట్టంగడంగిన 35

శా. కూపారుండును సంతసిల్లి జలజాక్షుంజూచి మిన్నంది స
ల్లాపం బుద్ధతిఁ బొంగఁ జూచి విరసోల్లాపంబునన్ రాఘవ
క్ష్మాపాలుండును గోపమున్ గదుర నీగర్వంబు నాచేత వ
మ్మైపో నిప్పుడటంచు లక్ష్మణుఁడు విల్లందియ్యఁ జెన్వొకతోన్. 36

మ. పరుషోద్యత్కుటిలాకృతిన్ బొమలు చూపట్టంగ శోణప్రభో
త్కరరేఖల్గనుఁగొల్కులన్ని గుడఁ గోదండంబు చేఁ దాల్చి భూ
వరవంశాగ్రణి రాముఁ డద్భుతముగా వారాశిసూఁడన్ వడిన్
శరజాలంబులు పేర్చి వేయుటయు నిచ్చన్ బ్రాణభీతిన్ బడిన్. 37

క. రామునియెదుట సముద్రుఁడు, తా మానవరూపుఁ దాల్చి దైన్యము దోఁపన్
రామునకు మ్రొక్కి యపుడా, ధీమంతున కనియె నిలిచి తేజం బెసఁగన్. 38

ఆ. ఇంక నేల తడయ నినకులాధీశ్వర, కపులఁ బంపి వేగఁ గట్టు మయ్య
కట్ట గట్టి దాఁటు కమలాప్తకులచంద్ర, నీదు కీర్తిలతకు నెలవు గాఁగ. 39

వ. మిమ్ము దరిసించుటకు మిన్నంటఁ బొంగితి సింతయ కాని కపటోపాయంబునఁ బొంగినవాఁడను గాను నని రామభద్రుండు కరుణాసముద్రుండు గావున సముద్రు నెప్పటియట్లయుండ నియమించి వానరులం బనిచిన. 40

క. రాముని పంపునఁ బ్లవగ, స్తోమం బట్లరిగి దొడ్డగుకొండల్
క్షేమమునఁ దెచ్చి జలనిధి, రామాజ్ఞను వైచి రథికరభసం బొప్పన్. 41

వ. ఇట్లు వానరవీరులు పర్వతపాషాణవృక్షజాతంబులు లక్షోపలక్షలుగాఁ దెచ్చి నారాశిం బడవైచి తద్గుభద్ధ్వానంబుల నుప్పొంగుచు బ్రహ్మాండభాండంబు బ్రద్దలగునట్లుగా నార్చుచు నట్టహాసంబులు సేయుచు గంతులువైచుచు వెక్కిరింపుచు బరువు లెత్తుచు నున్న దెచ్చివైచిన పర్వతాదుల నెల్లఁ దిమితిమింగిలములు మ్రింగ నాసమయంబున. 42

ఆ. తిరుగఁ దెచ్చి వైవఁ దేవిరా కుండుట, నాత్మలోన సంశయంబు నొంది
రాజసింహుఁ డపుడు రత్నాకరునిఁ జూచి, యడుగుటయును వేగ నాతఁ డనియె.

సీ. రావణుపంపున రాలెల్లఁ జేపలు, మ్రింగుచుండెఁ గదయ్య మేదినీశ
తిమితిమింగిలములు దిరుగుచు నాయందు. నుండి రావణుపంపు నొనరఁ జేయు
నలుఁడు కట్టినఁ గాని నిలువ నేరదు కట్ట, నలుని బంపఁగ వయ్య నళిననేత్ర
యని సంతృప్తి నెప్పి యప్పేళ నరగిన, నీవు లిచ్చుట మహావీర్యమునను

గీ. పర్వతంబులు తేరఁగా భానుకులుని, పంపుచేతను వారధిఁ బఱఁగ వేగ
నలుఁడు నాప్రొద్దె పదియోజనములు గట్టె, నంతలోఁ సూర్యుఁడస్తాద్రికరుగుచుండె.

వ. అంత సూర్యాస్తమయం బగుటయు వానరేంద్రులు తమబలంబులం గూడి వేగు నందాఁక సేతుబంధనంబునకుఁ గాపుండి రంత సూర్యోదయం బయిన వెంటనే మహాబలశాలియగు హనూమంతుండు సువేలాద్రి కరిగి యానగంబుపొంతనున్న హేమకూటంబును నాగపర్వతంబును సింహాచలంబు ననుమూఁడుకొండలు వాలపాశంబునం బెకలించి నిమ్మపండ్లమాడ్కిఁ బూఁబంతుల వంతున నెగరవైచుచు నేతెంచి నలుని కందిచ్చిన నాపర్వతంబులు మూఁడును దొంబదియోజనంబులు నిడుపుగల్గియుండ నిర్విఘ్నంబున శతయోజనములునిడుపును దశయోజనంబులు వెడల్పునుగా నీరనిధిని బంధించి నలుండావార్త రామున కెఱిఁగించినతోడనే యతండు లంకెగ్గలు పట్ట నుద్యోగించి పనసుశరభుగవయు జాంబవంతుఁ బడమటిగవను గవయు దక్షిణపుగవను హనుమంతుఁ దూర్పుగవను బట్టనియమించిన వారలును లంకాపురంబుఁ గ్గలను జొచ్చి రాక్షసుల నుగ్గునూచంబుగావించుచుండ హతశేషులు పరుగెత్తి యావింతయంతయు రావణునకెఱిఁగించిన నతండుఁ జింతాక్రాంతుండై దేవాంతక నరాంతక అతికాయ త్రిశిరో మహోదర మహాపార్శ్వాదుల రామలక్ష్మణులఁ జంపి వారి శిరంబులు గొనిరండని పనుప వారరుగుదెంచి ఘోరాహవంబునం దమ శిరంబులె రామలక్ష్మణుల బాణంబుల కర్పించిన వారిలోఁ జావగ మిగిలిన యతికాయుం డరుదెంచి తండ్రియగు రావణున కిట్లనియె. 45

శా. దేవా భానుకులావతంసుఁడు మహాధీరుండు రాముండు బా
హావిర్భూతమహాప్రతాపమున దైత్యవ్రాతముల్ భూరివీ
రావేశంబునఁ ద్రుంచెఁ బోమననుఁనం దాశ్చర్యముల్ భీతియున్
ద్రోవన్ నేఁడు వచింపనేల యిఁకఁ దద్ఘోరప్రతాపోన్నతుల్. 46

వ. అని యతికాయుండు విన్నవించిన నుల్కిపడి కుంభకర్ణుని మేల్కొలుపం బనిచిన నతండును లేచి యావులించుచుఁ బండ్లుగీటుచు లయకాలమృత్యువుఁ బోలె నేతెంచిన నట్టి యనుజుం జూచి దశముఖుం డిట్టు లనియె. 47

క. అనిలో నీవా రాముని, ననుపమబలశాలియైన యనిలతనూజున్
ఘనుఁ దగులక్ష్మణుఁ గూలిచి, చను వానరులతలలు గొంచు వేగమ రమ్మా. 14 48

వ. అని యనిపిన. 49

సీ. భేరీమృదంగాది భీమవాద్యధ్వాన, ములకు సముద్రముల్ పొంగి పొరలఁ
గపులపాలికి లయకాలుఁడో యనుచును, వినువీథి దివిజులు వెఱచి తొలఁగ
నతికాయుఁడును మహాహుంకారమున వేగ, వెనువెంట రోషప్రవృత్తిఁ జనఁగఁ
గుంభకర్ణుండు కాకుత్స్థుపైఁ బోయిన. దక్షిణోత్తరసముద్రములరీతిఁ
గీ. గడిసి యిరువురుఁ బోరాడఁ గడఁగుటయును, గపులు వేవేగ వచ్చిరి విపులశక్తి
సాధ్యగంధర్వపతులెల్ల సరభసమున, జూచుచుండంగఁ బోరిరి సుచిరముగ. 50

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు వీరావేశంబునఁ బోరుచుండఁ గుంభకర్ణుండు విజృంభించి బలంబుల కుఱికి దిగ్గజకర్ణపుటస్ఫోటితంబుగా నార్చుచు వానరవీరుల నసంఖ్యంబుగా మ్రింగుటయుం గడంగిన రఘువీరుం డలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి వాని శిరంబును దునుమాడె నంత నతికాయుండును తన పినతండ్రిపాటుకలిగి రాఘవేంద్రుని కభిముఖంబుగా నిలిచి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండ లక్ష్మణుం డడ్డువచ్చి నానాస్త్రంబులు ప్రయోగించి ఘోరంబుగా యుద్ధంబు సేసి కడపట వారుణాస్త్రంబు వింట సంధించి విడిచిన నది యతికాయునిశిరంబు ద్రుంచె నంత హతశేషులైన రాక్షసులు గాందిశీకులయి రావణుం జేరి. 51

గీ. దేవ దేవాంతకుఁడు సచ్చె దీనవృత్తిఁ, గుంభకర్ణుండు సమసెను ఘోరలీలఁ
దెగువ నతికాయుఁడును మ్రగ్గె దీనికింకఁ, బూని ప్రతికార మొనరింపు భూరితేజ.

వ. అని విన్నవించిన మండిపడి రావణుం డింద్రజిత్తుం బంపిన నతం డాగ్రహంబున. 53

క. పరవీరులపై వైచి, నరుచేఁ గొన్నట్టిచాపనారాచములన్
బఘుయు బ్రహ్మాస్త్రముఁ గొని, దుర మొనరింపంగ వచ్చె దోర్బలశక్తిన్. 54

వ. తదనంతరంబున. 55

క. తండోపతండములుగాఁ, జండాశుగసమితి, బరపి శైలశరాళిన్
గాండమయంబుగఁ జేయుచు, భండన మొనరించె దైత్యపతిపుత్రుండున్. 56

సీ. మిన్నక రామసౌమిత్రులమీఁదను, బ్లవగసేనమీఁద బాహుశక్తి
బ్రహ్మాస్త్ర మడరింపఁ బటునినాదంబునఁ, బఱతెంచి వానరప్రతతిమీఁద
బ్రహ్మమంత్రజ్ఞానపరులైనవారి ని, గ్రంథంబుగాఁ జుట్టి పట్టి కట్టి
తక్కినవారల నుక్కడంగించినఁ, గనుఁగొని యమరేంద్రకంటకుండు
గీ. వైర మెల్లను నేఁటితోఁ దీఱె ననుచు, మించి కెరలుచు విల్లెక్కుడించి పొదలి
శాంతతను బొంది రాక్షసచక్రవర్తి, కడకు నేఁగెను వడి ముద్దుగొడుకుఁగుఱ్ఱి. 57

క. మునినాయక విను మంతట, దనసునుమలపాటు జెలిసి తనలోఁ దానే
కనుఁగొనఁ జాలక పోయెనొ, యనఁగను నపరాబ్ధిలోన నర్కుఁడు గ్రుంకెన్. 58

క. అరవిందభవుని కరుణను, వర మందిన వాయుసుతుఁడు వసుమతిమీఁదన్
మఱి బ్రహ్మాస్త్రజపమున, బిరుదై యున్నట్టి గుణవిభీషణుఁ డొకఁడున్. 59

వ. తక్కఁదక్కిన వా రెల్లను మూర్ఛాగతులై చచ్చినయట్లు పడియున్న సమయంబున వాయుసుతుండును విభీషణుండును దమలో నెవ్వరు చచ్చిరో నొచ్చినవా రెవ్వరో విచారింపం దగునని మహోగ్రాంధకారంబు నడుమ నింగలపుఁ గొఱవులు పట్టుకొని రణరంగంబుఁ గలయ శోధింపుచువచ్చి శరతల్పంబుననున్న జాంబవంతునిం గని విభీషణుం డిట్లనియె. 60

క. భల్లూకేశ్వర! వానరు, లెల్లను నృపవరులతోడ నిలమీఁదను మూ
ర్ఛిల్లియుఁ జచ్చియు నున్నా, రొల్లఁబోఁ జేయు దీని కుపమ యెటన్నన్. 61

ఆ. అపుడు జాంబవంతుఁ డసురేశ నీవంకఁ, గన్ను విచ్చి చూడఁ గానరాదు
వాయుసుతుని మేలువార్త నా కిప్పుడు, చెవులు సోఁకునట్లు చెప్పు మయ్య. 62

వ. అనిన విని హనుమంతుండును. 63

చ. పదములఁ జేరి మ్రొక్కుచును బాణియుగంబును మోడ్చి నీకృపన్
బ్రదికినవాఁడ నన్ను నతిప్రీతిని జేరఁగఁ దీసి నీ విటన్
బ్రదికితిగాన నీకతనఁ బార్థివముఖ్యుని సేన లన్నియున్
బ్రదుకు నిజంబుగా నిపుడు పావనియంచుఁ బ్రియంబు సేయుచున్. 64

వ. వినుము వాయునందనా యీ లవణసముద్రంబుఁ దాఁటి హిమవంతంబును నిషధాచలంబును గడచి మేరుశైలంబును వెండికొండయును శ్వేతపర్వతంబును నతిక్రమించి ఘృతసాగరంబు లంఘించి ద్రోణగిరిమధ్యంబునందున్న యోషధశిఖరంబునం గల సంజీవన్యాది దివ్యౌషధంబులు గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబుల ప్రాణంబులు నిలిపి కీర్తి వడయుమని ప్రార్థించిన నియ్యకొని వాయునందనుండు వాయువేగమనోవేగంబులం జని జాంబవంతుఁడు సెప్పిన దివ్యౌషధాచలంబునె కొనివచ్చి సకలసైన్యంబుల ప్రాణంబులు గాచి నిమేషమాత్రంబున నక్కొండ తొల్లింటియునికిపట్టుననె నెలకొల్పి వచ్చెనప్పుడు. 65

క. ఇనుఁ డుదయపర్వతంబునఁ, గనుపట్టెఁ దెల్లవాఱెఁ గపిసైన్యములున్
జననాథుఁ గాంచి మ్రొక్కిరి, జనపతియును వాయుసుతుని సంశ్లాఘించెన్. 66

వ. అంత నింద్రజిత్తుపరాక్రమంబునకు సంతోషించి నిజంబును గల్లయును దెలియుటకు
రావణుం డనుపఁజారు లేతెంచి యుత్సాహంబుతో యుద్ధసన్నద్ధులై కేరలుచున్న
వానరబలంబులం గనుంగొని మరలి చనుదెంచి రామచంద్రుని బలంబున్న తెఱం
గెఱిగించిరి అదివిని కలంగియుఁ గలంగనిగంగిరి నాశ్చర్యంబు నొంది రామలక్ష్మ
ణులపైకిఁ గుంభనికుంభగవాక్షప్రజంఘశోణితాక్షులం బంపిన వారును దమతమ
బలంబులతోడఁ గరి తురగ రథారోహులై వెడలి సింహనాదంబులు సేయుచు
వానరసైన్యంబుల పైఁ గవిసి శరవర్షంబు గురియుచుఁ బహులం జక్కు సేయుచు పరిఘ
దంబుల వ్రేయుచు ముద్గరంబులం జెండుచు ముసలంబుల మోఁదుచుఁ గరవాలంబుచే
మట్టింపుచుఁ దురంగమములచేఁ ద్రొక్కించుచు రథంబులం దోలి వెంపరలాడుచు
మహాహవంబు సేయుసమయంబునఁ గపిబలంబులు గిరివర్గంబులుఁ దరువర్గంబులును
నస్త్రశంబుగాఁ గైకొని ప్రతిఘటించి పోరాడె. 67

క. తెంపున వాలికుమారుఁడ, కంపనుఁడనువాఁ డెదుర్పఁ గని. కోపమునన్
గంపింపం బట్టి వానిని, జంపెను వక్షంబు వ్రాఁడిచి సాహసవృత్తిన్. 68

వ. అప్పుడు.

చ. కనుఁగొని శోణితాక్షుఁడు నకంపనుబ్రాణము గొన్న వాలినం
దనుశిపయిం గడుం గినిసి తార్క్ష్యుని తాఁకి శరంబుఁ దోలినన్
గనలుచు నంగదుండు తురగంబులతోన రథంబు గ్రుగ్గగా
దనుజునిమీఁదఁ దానురికి తన్నిన వాఁడును గూలె నేలపైకెన్. 70

ఆ. అతఁడు నేలఁ గూల నాప్రజంఘుండును, ఘనుఁడు యూపనేత్రుఁ డేసి వాలి
కొడుకుమీఁద రాఁగఁ గోపించి మైందుండు, ద్వివిధుఁ డంతలోనె తెంపు మిగిలి. 71

క. దనుజులఁ దోలఁ బ్రజంఘుఁడు, కనుఁగొని యవ్వాలిసుతునికటములు సోఁకన్
గవలి నిశాచరుశిరమును, సునతరవృత్తముష్టిఁ బొడిచి గడపెన్ ధరన్ 72

సీ. ఘనుఁడు ప్రజంఘుఁడు కదనంబులోఁ బడ్డ, నక్షయబలుఁడు యూపాక్షుఁ డాత
గదఁగొని వ్రేసిన ఘనతతోఁ గుప్పించి, భుజశక్తి నాతనిఁ బొదవి పట్టి
కొనిపోవునప్పుడు కోపించి యన్నకై, శోణితాక్షుఁడు వచ్చి శూరుఁ డగుచు
విడిపించుకొనఁ జూడ వడిగ మైందుఁడు డాసి, కలన యూపాక్షుని గదిసి పోరి

గీ. సాహసంబున నొఱలంగఁ జంపుటయును, శోణితాక్షుండు ద్వివిధుని జూచి పొడవ
నతఁడు మూర్ఛిల్లి తెప్పిరి యసురఁ బట్టి, శిరము నూలంగ నడిచెంబు చేత వ్రేసె 73

గీ. శోణితాక్షుండు పోరిలోఁ జూర్ణ మయినఁ, గుంభుఁ డప్పుడు కోపించుకొనుచు వచ్చి
ద్వివిధు నెదురొమ్ము నాటఁగఁ దీవ్రశరము, లేసి వడిఁ జంపె నాజిలో నేమిచెప్ప.

క. తమ్ముని పాటు గనుంగొని, హుమ్మరి మైందుండు కుంభు నురతరముష్టిన్
ఱొమ్మునఁ బొడిచిన నతఁ డొ,క్కమ్మునఁ గూలంగ నేసె నమరులు దలఁకన్. 75

ఉ. అంగదుఁ డంతఁ గుంభనిశితాంగము పై నొకపర్వతంబు భూ
మిం గలయంగ వ్రేయుటకు నేదిసికెన్ పడి దాఁటి వాలిపు
త్త్రింగని దైత్యుఁ డాగ్రహముతో ముసలంబున వ్రేయ నొచ్చి తోఁ
కం గోవగ్రిప్రాతుడు సగర్వమునన్ దగమోద నార్చుచున్. 76

వ. అట్టియవసరంబున. 77

క. కాలాంతకరుద్రులతోఁ, బోలుపఁదగు కుంభుఁ డపుడు భుజబలశక్తిన్
వాలికుమారుని ధరపైఁ, గూలఁగ వడి నేసె నైదుకోలలచేతన్. 78

వ. ఇట్లు వాలికుమారుండు కుంభునిచేత బాణపీడితుండై పడుటయెఱింగి రామచంద్రుండు వానిపై సుగ్రీవజాంబవద్ధనుమదాదులం బంచిన. 79

క. వారంవ రథిపు వ్రాజ్ఞను, భూరుహములు గిరులు గొనుచు భువనము లదరన్
బోరన నార్చుచు గుంభునిఁ, దారసమై వ్రేసిరంత దర్పోద్ధతులై 80

క. వారలు వ్రేసినతరుగిరు, లారయఁ దమదాకకుండ నవి తునియలుగాఁ
గ్రూరాస్త్రంబులఁ దునుముచు, నారసములు వారివారి నాటఁగ నేసెన్. 81

క. ఏసినఁ గుంభుని రవిజుని, డాసమయమునందు నేసె నద రంటంగా
నేసినఁ గ్రమ్మఱ రవిజుని, గాసిల వక్షంబు పొసువఁగా నిలఁబడియెన్. 82

గీ. మూర్ఛ తేఱి యారవిజుఁ డమోఘముష్టి. ప్రాని దైత్యుని ఱొమ్మపైఁ బొడువనంత
శరధి మథియించు మందరాచలమునాఁడ్క, ధీరతయుడఁగి దిద్దిరఁ దిరిగి పడియె. 83

ఉ. కుంభుఁడు గూలినంగని నికుంభుఁడు దాఁ బరిఘాయుధంబు సం
రంభ మెలర్పఁ ద్రిప్పి దినరాజతనూజునిపైకి రాఁగ బల్
సంభ్రమ మొప్ప వాయుజుఁడు శౌర్యము గన్పడ నడ్డమైనది.
క్కుంభిగముల్ కలంగఁగను గొబ్బున వక్షము వైచె నార్చుచున్. 84

క. వ్రేసిన పరిఘాయుధ మది, వీసము నాటంగలేక విఱిగిన మిగులన్
గాసిలి దైత్యుఁడు పవనజు, వాసమయమునందు నేసె నడినముచేతన్. 85

గీ. అంత హనుమంతుఁ డుగ్రుఁడై యసురగళము, నంగువాలంబు దగిలించి యాకసమునఁ
ద్రిప్పి ధరణీతలంబునఁ ద్రెళ్ళగొట్టి, సింహనాదంబుఁ జేసె నచ్చెరువుగాఁగ. 86

వ. అట్టి సమయంబున. 87

క. హతశేషులు ఘటకర్ణుని, సుతు లాహవభూమిఁ దెగిన సుద్దులు లంకా
పతి కెఱిఁగించిన మదిఖి, న్నతుఁడై యొక్కింత తడవునకు నిట్లనియెన్. 88

గీ. మనసుఁగలయట్టి బాంధవజనులుసుతులు, దొరలుఁబరివారములు గంధకరులుహరులుఁ
గుటిలకపియూథములబారి గొరియలగుచుఁ, దెగిరినునుమట్ట నేటితోఁ దీవ్రగతిని.

వ. అని చింతింపుచుఁ గొంతవడికి ధైర్యంబు గొని. 90

క. దైతేయవల్లభుఁడు గడు, ప్రీతిన్ మకరాక్షుఁజూచి పృథుతర శక్తిన్
మాతండ్రి ఖరునిజంపిన, యాతనిపైఁబోవు వీరు మరుగు మటన్నన్. 91

సీ. సింధుర రథభట సైంధవంబులతోడఁ, దళమైన పట్టుఛత్రములతోడఁ
బటహ భేరీముఖ్య బహువాద్యములతోడ, దట్టంపు నానాయుధములతోడ
వందిమాగధసూత బృందస్తుతులతోడఁ, గెరలాడుబిరుదు టెక్కెములతోడ
బహుళ కాహళ శంఖ ఝాంకారములతోడ, రాజిల్లు నవచామరములతోడ

గీ. నడిచె దిగ్దంతి భూదారనాగకూర్మ, కులనగేంద్ర యుతయుగ భూతలము గదల
బవర జయపాళి సంఘన్న భావుడగుచు, దక్షుఁడైయట్టి మకరాక్షుఁ డాక్షణంబ 92

వ. ఇట్లు భయంకరాకారంబుగాఁగదలి వానరవీరులతోడం దలపడి పోరాడునెడ వానరబలంబులు తలచెడి పాఱుటగని రాజపుంగవుండోహో వెఱవకుఁడని తనముఖ పునరుక్ మరలించి మకరాక్షుం దేరిచూచి చండగాండముల తండంబులుఖండించి హరుల శరంబులపాలుచేసి రథంబులను సారథులతోడంగూడఁ బృథ్విం గలిపిబలంబులఁ జలంబునం దఱిమి సింహనాదంబు చేసినం గినిసి మకరాక్షుం డిట్లనియె. 73

కం. మాతండ్రి ఖరునిఁ జంపిన, నీతో యుద్ధంబు సేయ నేఁ డిదె కలిగెన్
గా తీవ్రనిశితసాయక, పాతంబుల పాలొనర్తుఁ బగదీరఁగ నినున్. 94

మ. అని రోషోక్తులు పల్కుచున్ గెరలి తీవ్రాస్త్రంబు లారాముపైఁ
దన బాహాబలశక్తి నేయఁగని కోదండమునన్ దన్పుచున్
వనజాప్తాన్వయుఁ డేసె వానినట గీర్వాణుల్ ప్రశంసింపఁగా
దనుజుం డేసెను రామభూమిభునిపైఁ దద్బాణ జాలంబులన్. 95

క. ఆశరము లుడిపి మఱియొక, యాశుగమున వానిచాప మపుడు దునిమి యా
దాశరథి రథముపొడిగాఁ, గౌశలమున నేయ వాఁడు క్ష్మాస్థలి గ్రుంకెన్. 96

ఆ. ధరణి నుఱికి దుష్టదైత్యుండు గదఁ ద్రిప్పి, భానుకులుని నేయ దాని నొక్క
విశిఖమునను దునిమి వేగంబె. విభుఁ డగ్నిఁ శరముఁ దొడిగి వాని శిరముఁ ద్రుంచె. 97

క. ఆయెడ మకరాక్షుండు రిపు, సాయకములు దూఱి నాఁటి చచ్చుట విని దై
తేయుఁడు గుండెలు పగుల యఁ, బాయని దుఃఖంబు పాలుపడి చింతిల్లెన్. 98

వ. ఇట్లు చింతాక్రాంతుండై కొంతతడవూరకుండి మేఘనాథునిఁ గనుంగొనియె. 99

క. అక్కట! నీవును నేనును, దక్కఁగ మఱి తక్కినట్టి దళములు దెగఁగా
నొక్క కపియైనఁ గాని, యక్కడ రిపులందు నొచ్చిరవఁగా వింటే. 100

వ. అదియునుఁ గాక. 101

సీ. నాగపాశంబున నాఁ డాఁకలోఁబడ్డ, ప్లవగు లీరీతని బ్రతుకు టెట్లు
బ్రహ్మాస్త్రమునఁ గూలఁబడి ధాత్రి యెడఁబాసి, పోయిన కపులెల్లఁ బుట్టు టెట్లు
కుంభకర్ణుఁడు చావఁగొట్టిన వానరుల్, చెచ్చెరఁ జీవించి వచ్చు టెట్లు
అతికాయుఁ డడఁగించినట్టి కీశబలంబు, క్రమ్మఱఁ దానెల్లఁ గలుగు టెట్లు

గీ. రాముఁ డెన్నంగ నాదినారాయణుండె, వనచరావళు లెల్ల దేవతలు మున్నె!
కానలేనైతి నీరీతిఁ గదనమునను, వారి గెలువంగ నెవ్వారి వసము చెపుము 102

వ. అని దీనాలాపంబు లాడుచున్న తండ్రికి నమస్కరించి మేఘనాథుండు మేఘగంభీరవాక్యముల మనఃఖేదోపశమనంబు చేసి నేఁటితోడఁ బగసాధింతు నని ప్రాగల్భ్యంబుగఁ బలికి యనిపించుకొని గజవాజిశతాంగాగు లగుచతురంగబలంబులు కూర్చుకొని ఛత్రచామరంబులు పిక్కటిల్ల నట్టహాసంబు సేయుచు లంకాపురంబు వెడలి సంగ్రామరంగంబునకుఁ జని తన బలంబులఁ జక్రాకారంబుగా నిలిపి తన్మధ్యంబున రథావతరణంబుచేసి రక్తాంబరగంధమాల్యంబుల ధరియించి లోహపాత్రంబునఁ గృష్ణసర్పరక్తంబు నించి తర్పణంబుచేయుచుఁ దద్విధియుక్తంబైన హోమంబులు సేయుచుండునెడ నొక్కకృత్య ప్రత్యక్షంబై నిలిచి మెచ్చితి వరం బిచ్చెద వేఁడు మనిన నతండు తానాకసంబునుండి భండనంబు సేయునెడఁ గపులకుం గానరాకుండ నంధకారంబు గాపించిన నేను వారిని జయింతు నని ప్రార్థించిన నియ్యకొని యేనంత మేఘనాథుండు నభంబున కెగసి మహాంధకార బాణంబు వేసిన దానం జేసి పెంజీఁకటి గప్పినఁ జీకాకై పారుచున్న వానరులం గని వాయునందనుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. 103

క. వాయవ్యాస్త్రముచేతను, బాయును జుమ్మంధకారబాణవిశేషం
బీమెద నేయుఁడు శీఘ్రము,నాయక యని విన్నవింప నవ్విధము నంతన్. 104

క. పిల్లెక్కు వెట్టి మారుతిఁ భల్లము సంధించి తివిచి పార్థివుఁ డలుకన్
బెల్లార్చి యేసె గగనం బెల్లను వడిఁ దూల దైత్యుఁ డిలపైఁ గూలన్. 105

ఆ. రాజతిలకుఁ డంబరమ్మున కెగయంగ, వాయుశరముఁ దొడిగి వేయఁ దడవె
మాయశక్తి దొలఁగిపోయిన నంతలో, మేఘనాథుఁ డుర్విమీఁదఁ బడియె. 106

చ. పడియును మేఘనాథుఁడు సుపర్వులు బెగ్గిల నుగ్రబాణముల్
తొడిగి ప్లవంగసేనపయిఁ దోరముగా నడరింప నంతటన్
బెడబెడ నార్చి మారుతివిభీషణు లుగ్రత దానవావళిన్
బొడిపొడి సేయ లక్ష్మణుఁడు పూనిక నాతనిఁదాకె నార్చుచున్. 107

క. అంతట దానవసేనలు, పంతము చెడి తలలువీడఁ బాఱఁ గని తా
నెంతయు వెఱవకుఁ డనుచును, గుంతము ద్రిప్పుచు దైత్యకుంజరుఁ డంతన్. 108

శా. సౌమిత్రిం గని గర్వ మొప్పఁ బలికెన్ శౌర్యంబు సంధిల్లఁగా
నామీఁదం బఱపింపవచ్చి తప్పులే నాగాస్త్రసంఘంబులన్
నేమిమ్మొందఱఁ గట్టుటల్ మఱచితే నేఁడైనఁ జింపింపుమీ
నీ మాసత్త్వవిశేష మెల్ల మదిలో నిక్కంబుగా లక్ష్మణా. 109

వ. అని బాణప్రయోగంబు సేసిన. 110

క. వానిని బ్రతిశరములు దాఁ, బూనిక సంధించి త్రుంచి భుజబలశక్తిన్
దానవుని మూర్ఛ వుచ్చెను, భానుకులుండంత నొక్కబాణముచేతన్. 111

ఆ. ఇంద్రజిత్తంతట నినకులోద్భవునిచే, మూర్ఛ నొంది తెలిసి మూర్ఖగతిని
భాసమాన మైన బాణతతియుంబున, నతని నొవ్వ నేసి యార్చె నంత. 112

సీ. సౌమిత్రి తావానిచాపంబు నడిమికి, ఘనతరాస్త్రంబుచేఁ దునుగ నేసి
పదిబాణములు వాని బాహుద్వయంబున, గాటంబుగా వడి నాట నేసి
తురగంబులను నాల్గింటి నొప్పులఁ దునుమాడి, సారథి నొక్కట సంహరించి
శరవృష్టిఁ గప్పిన సురవైరి కోపించి, కాద్రవేయాస్త్రసంఘంబు లేయ

గీ. గరుడశరమునఁ దునిమె లక్ష్మణుఁడు కినిసి, వడిఁ గుబేరాస్త్ర మతఁ డేసె వైవెచెనసు
దానిఁ దునుమాడి వేగ నైంద్రాస్త్ర మేసె,నరవరుఁడు దానియాప్యబాణమునఁ ద్రుంచె

వ. ఇట్లు ద్రుంచిన. 114

క. వరుణాస్త్రంబును నేసెను, సురరాజవిరోధి రాజసూనునిమీఁదన్
గర మలిగి రామునసోదరుఁ, డరుదారఁగ వానిఁద్రుంచె నైంద్రాస్త్రమునన్. 115

వ. అని మఱియును. 116

గీ. కనలి దానవుఁ డతనిపై గంధపుష్ప, సమితి నొప్పెడు గంధర్వశరముఁ దొడిగి
వేయఁ గోపించి దశరథసార్వభౌమసుతుండుఁ ఖండశశిబాణమున దానిఁగండడంచె. 117

వ. ఇట్లు గంధర్వశరంబును ద్రుంచి యంతటం బోవక దేవేంద్రదత్తంబైన భుజగాస్త్రంబు వింట సంధించి వేదంబులు సత్యంబగు నేని రామచంద్రుండు ధర్మాత్ముం డేని యింద్రాదిబృందారకద్రోహియైన యింద్రజిత్తునిశిరంబు నీశరంబు ద్రుంచుం గాకయని వానిపై లక్ష్యంబుచేసి ప్రత్యాలీఢపాదస్థుండై నిలిచి కర్ణాంతంబుగాఁ దిగిచియేసిన నదియును గాలానలాభీలజ్వాలాజాలంబు లుప్పతిల్ల గగనంబునం బఱతెంచి యక్కౄరుని రక్కసుని శిరంబుఁ ద్రుంచిన. 118

క. కనుఁగొని దేవతలందఱుఁ, దనుఁ బొగడఁగ సురలి రామతమ్ముఁడు విజయం
బున వచ్చి మ్రొక్కనాతని, మనుజేంద్రుఁడు కౌఁగిలించి మఱి యిట్లనియెన్. 119

క. నీచేత వీఁడు ద్రుంగుట, భూచక్రంబెల్ల మేలు పొందెను వినుమీ
నాచేత దశముఖుం డను, నీచుఁడు తెగుటెల్ల నిజము నిర్మలచరితా. 120

వ. ఇట్లు సౌమిత్రిచేత సింద్రజిత్తు తెగె నని చెప్పిన నారదుని వాల్మీకిమహామునీంద్రుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయును. 121

క. జలజాక్షు! భక్తవత్సల !, జలజాసనవినుతపాద జలజాత ! సుధా
జలరాశిభవ్యమందిర !, జలజాకరచారుహంస ! జానకినాథా. 122

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధగురులింగజంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుత యాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు యుద్ధకాండంబునందు
ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు

# మొల్ల రామాయణము



## యుద్ధకాండము, ద్వితీయాశ్వాసము





మలిన శుభచారిత్రా!
కమలదళ సమాన నేత్ర! కౌశిక మిత్రా!
ద్యుమణికుల వార్ధిసోమా!
సమదాసురజనవిరామ! జానకి రామా! 1

వ. శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుమట్లు. 2

ఆ. చారు లరుదెంచి సౌమిత్రిచే నింద్ర, జిత్తు గూలె ననుచుఁ జెప్పుటయును
బంక్తిముఖుండు సుతునిఁ బలుమాఱుఁ దలఁచుచు, వగవఁ బొచ్చె నెల్లవారు వినఁగ

వ. ఇట్లనేక ప్రకారంబులఁ గుమారుం బలవరింపుచు దుఃఖింపుచుఁ గొంతతడవున కూరడిల్లి ధైర్యంబు నూలుకొల్పి తన కుమారుం జంపినవానిని నేఁ డవశ్యంబును సంగ్రామరంగంబునఁ జంపుదునని నియమంబుచేసి తత్క్షణంబ. 4

సీ. శైలసన్నిభము లౌ సామజంబులతోడ, ననిలవేగము గల్గు హరులతోడఁ
గాంచనోజ్జ్వలము లౌ సునరథంబులతోడఁ, బ్రతిలేని ఘనమహాబలముతోడఁ
గిమ్మీరవర్ణోరు కేతనంబులతోడఁ, దఱచైన పట్టుఛత్రములతోడ
భేరీమృదంగాది పృథువాద్యములతోడ, వరశంఖ కాహళధ్వనులతోడఁ

గీ. బాదఘట్టనచలితోర్వీభాగుఁ డగుచు, వధువులెల్లను బిండిలిపండు గాఁగ
నడిచె లంకేశుఁ డధికసన్నాహమునను, రామచంద్రునితోడను రణ మొనర్ప. 56

మ. కరిఘీంకారములున్ మహాజవతురంగవ్రాతహేషావళుల్
వరకోదండనినాదముల్ సుభటదుర్వారాట్టహాసంబులున్
గురుశంఖోజ్జ్వలనాదముల్ దశదిశాక్రోశంబుగా నొక్కటై
పరఁగన్ బంక్తిముఖుండు దా నడిచెఁ గోపస్ఫూర్తి నిశ్శ్వాసుఁడై. 57

వ. ఇట్లు చతురంగబలంబులుగొన్న లోకవిద్రావణుం డగు రావణుండు సమరంబొనర్ప నరుదేరంగ నిరాఘువేశ్వరుం డతనికి దండనాయకులం బనిచిన వారునుదయగిరిపాషాణపాణులై యెదురునడచి సింహనాదంబులు సేయ నుభయబలంబులుం దలపడి పోరాడుసమయంబున నమరవైరులు శస్త్రాస్త్రవర్షంబులు గురియించి నొప్పించినంత వానరవీరులు మరల దానవులపైఁ బాషాణపాదపంబు లడరింప నరిబలంబులు విఱిగి పికాపికలై పఱచున త్తఱిఁ బంక్తికంధరుం డుదగ్రుడై కెరలుచుఁ గ్రూరనారాచంబులుచాపంబునం దొడిగి పనసపవనతనయనలనీలద్వివిదశరభకుముదగజగవయగవాక్ష గంధమాదనాంగద మైందాదుల నొక్కొక్కరిఁ బదేసిబాణంబుల గుదిగొన సేసిన విఱిగి యగచరసేనలు మరిగె నయ్యవసరంబున, 7

క. చేరి విరూపాక్షుని దగు, తేరుపయిని నొక్కకొండ ధీరతతోఁ జక్
సూరజుఁ డప్పుడు మిక్కిలి, శూరత్వం బడర జేసి చూర్ణము సేసెన్. 8

ఆ. రథము విఱిగినంత రణమధ్యమున నొక్క, వారణంబునెక్కి వచ్చునెడను
వాలికొడుకు దాని వటురోషమునఁ దోల, నుఱికె ప్లవగుఁ గోల నఱికె వాఁడు. 9

క. అక్షయబలుఁ డగురవిసుతుఁ, డాక్షణమున నుగ్రుఁ డగుచు నద రంట విరూ
పాక్షునివక్షముఁ బొడిచిన, రక్షోపిమంపు కూలి రణమునఁ బడియెన్. 10

వ. ఇట్లు కూలిన 11

క. హుమ్మని యాతనికూరిమి, తమ్ముండును గనలి వచ్చుతపనజు నత్యు
గ్రమ్ముగ మార్కొని జడిగా, నమ్ముల వర్షంబుఁ గురియ నాలోఁ బెలుచన్ 12

చ. శరములు తాఁకకుండ నొకశైలమునం దగ నొసరించి యా
యరదము నుగ్గుగాఁ గపికులాగ్రణి వైచిన వాఁడు నేలకున్
వరభుజశక్తి దాఁటి కరవాలున నేసినఁ దప్పఁగ్రుంకి వా
నరపతికొట్టె నప్డు మహినాథుఁడు సంతసమంది చూడగన్

క. కదనమున నొచ్చి దానవుఁ, డదలింపుచు భానుసుతునియూరల వగులన్
గదచే నడిచిన వానినిఁ, గుదియంగాఁ బట్టివైచెఁ గుంభినిమీఁదన్, 14

క. అంత సుపార్శ్వుఁడు మిక్కిలి, పంతము సెలపుచును రథము పవనాత్మజుపై
నెంతయుఁ బఱపుచు బాణము, లంతంతనె నాట సేయు నవసరమందున్. 15

సీ. హనుమంతుఁ డాదైత్యునరదంబుపై దాఁటి, చెక్కలువాఱఁగ ద్రొక్కి వేసి
సైంధవంబులఁ జంపి సారథితలఁ గొట్టి, గొడుగులు పడగలు పుడమిఁ గప్పి
వడి వానిచే నున్న యడిదంబుఁ గైకొని, బిరుసుగా నేసిన ధరను గూలి
గొబ్బునఁ దెప్పిర్లి కోపంబు, దీపింప ననిలజునురము మూఁడంబకముల
గీ. జాంబవంతుని నిరుమూఁడు సాయకముల, వడి గవాక్షుని నైదింట వాలిసుతుని
నేడుబాణంబులను దూలఁ జేసె నతఁ, డవనిఁ బడి లేచి యంగదుం డాగ్రహమున
గీ. వానిచేవిల్లు విఱిచిన వాఁడు కినిసి పరిఘఁ గొని యేయ మూర్ఛిల్లి ధరణిఁ వాలి
తెలిసియంగదుఁ డాదైత్యుఁ దెగువమరవ, పిమ్మ గడంచినగతి ముష్టిఁ బొడిచిచంపె.
వ ఇట్లు సుపార్శ్వాదిరక్షో నాయకు లాక్షణంబునం గూలిన 18
క. తనకట్టెదురను గూలిన, దనుజులఁ బెక్కండ్రఁ జూచి దశకంఠుఁడు దాఁ
గనలుచు సూతున కనియెను, జననాయకుమీఁద రథముఁ జనని మ్మనుచున్. 19
ఆ. అధిపుఁ డానతిచ్చినట్లుగా సూతుండు, రామచంద్రుమీఁద రథము వఱపె
నపుడు శంఖకాహళాదిరవంబులు, వందిజనులనుతుల సందడింప. 20

వ. ఇట్లు శతాంగ గజ తురంగ హేషారవంబులును బహుళకింకిణీఘంటికానినదంబులును
రథనేమిస్వనంబులును దనుజభటాట్టహాసంబులును భోరుకలంగ సంగరరంగంబున
కరుగుదెంచు నక్తంచరేశ్వరుండు ధనుర్ధరుండై ప్రతిఘటించు సమయంబున 21

క. తన కెదిరించిన రాముని, గని దనుజవిభుండు కినుక గదురఁగ నటఁ జ
య్యన నాగాస్త్రములు దన, ఘనపునఁ గీలించి యేసెఁ దతభుజశక్తిన్. 22
క. అవిఁ లెక్కగొనక పోరఁ బోరి, నవనీనాయకుడు గినుక నసురాధిపుపై
దివిజారు లులికి పారఁగ, బవిసన్నిభమై తీవ్రబాణము లేసెన్. 23
సీ. లంకేశుఁ డవియెల్ల లక్ష్యంబు సేయక, తిమిరాంబకము సంధించి యేయ
నిబిడమై చీకటినిండఁగఁ బర్వనఁ, గపు లెల్ల నందులై గళవళింప
నుర్వీశ్వరుం డంత నుగ్రబాణంబుల, నంధకారం బంత నడఁగఁ జేసి
వాసవారాతిపై వహ్ని బాణము సేయ, నాతండు రౌద్రాస్త్ర మదర వేసె
గీ. రెండుబాణంబులును గూడి గండెసంగఁ బెనఁగి యాకాశమున నండిపృథ్వీమీఁదఁ
బడియె నద్భుతగతి జగత్ప్రళయముగను, సురలును దైత్యులుఁ జోద్యపడఁగ.

వ. అట్టి మహాద్భుతకరంబుగా సమరంబు జరుగుచున్న సమయంబున. 25

క. రాముని మేనను బాణ, స్తోమంబులు నాట నేసె సురరిపుఁ డలుకన్
రాముఁడు ఘన నారాచ, స్తోమంబులు నాట నేసె సురరిపుమీఁదన్. 26

చ. ఘనరిపుమీఁదయుం గనలి దానవనాయకుఁ డేసె నంత భీ
కరశరభోష్ట్రకాక ఫణిగృధ్రకఘూకబలాక భేకసూ
కరకరిఋశ్యధూమ్రశుకగర్దభభల్లుక నీలకంఠకే
సరివృకగృధ్రకీటబకసైంధవసైరిభవక్త్రబాణముల్. 27

వ. ఇట్లు నిరంతరంబుగాఁ బ్రయోగించిన. 28

చ. పరువడి మీఁద వచ్చుచటు బాణచయంబులఁ జూచి రాఘవుం
డరుదుగ వాని నన్నిటి వియత్తలవీథిని ద్రుంచి క్రమ్మఱన్
సురరిపుమీఁద నేసె బలసూదనముఖ్యులు సూచి మెచ్చ ని
బ్బరముగ నగ్నిబాణము నభంబునఁ గీలలు పర్వుచుండఁగన్. 29

వ. అమ్మహాస్త్రంబువలన. 30

క. దహనముఖంబులశరములు, గ్రహముఖములు గలుగునట్టి ఘనతరశరముల్
మిహిరముఖంబులశరములు, బహుళముగాఁ గల్గి దైత్యపతిపై బర్వన్

ఆ. అంతదానవేంద్రుఁ డాబాణతతులెల్లఁ దృణముఁబట్టు నడుమఁ ద్రుంచివైచి
మయునిచేతఁ గొన్న మహనీయ మగునట్టి, శంబరాఖ్యమైనశరము వైచె. 32

క. ఆశరమున బహుశస్త్రము, లాశుగతిం గలిగి గవియ నన్నిటి నొకటన్
నాశము చేసెను రాముం, డాశాపతు లలర మన్మథాస్త్రముచేతన్. 33

ఆ. శంబరాఖ్యశరము జగదీశుబాణంబు, వలనఁ జెడక రాము వక్షమడర
నాటె నంతలోన నాకారిపై నేసె, విశిఖతతులు వేయి వేయుసెడను 34

క. రావణుఁ డాబాణములకు, వేవేగను బ్రతిఘటించి వేసినశరముల్
చేవమెయిఁ దాఁకి పడి ధా, త్రీవలయంబునను బడె ధరిత్రి వడంకన్. 35

ఉ. తల్లడ మంది రామవసుధాపతి కడము సొచ్చి లక్ష్మణుం
డల్లమునొవ్వ నాటుచు మహోన్నతకోపముతోడ దైత్యుచే
విల్లును నారియుం దునిమివేసి వడిన్ శరసప్తకమ్ము చే
బల్లిదుఁ డైనదైత్యకులపాలుని వక్షముఁ దూర్చిగూర్చెన్. 36

క. అంత విభీషణుఁ డగరే, ద్రాంతకు నరదంబుఁ గూల నట నేసినన
త్యంతజవంబున ధరణికి, గంతుగొనెన్ వడిని బంక్తికంధరుఁ డలుకన్, 37

వ. ఇట్లు తనరథంబుఁ గూలనేసిన విరథుండై రావణుండు మయదత్తంబైనశక్తి నిబ్బాని తమ్మునిఁ నేయఁజూచుచున్నంత శరణాగతవజ్రపంజరుండగు రాఘవేశ్వరునితోఁబుట్టువగుటంజేసి లక్ష్మణుండు కరుణాపరుండై విభీషణుం దన వెనుక నిడికొని యెదిర్చినఁ గని నీవు నాపగర కడ్డంబైతివి గావున నీవ యీశక్తిచేత హతుండవు గమ్మనియేసిన నదియుఁను శతఘంటికారంజితంబును శతకోటిసినదంబును బావకజ్వాలాభీలకీలాన్వితంబునై పరతేరం గని సురేంద్రాదిదేవగణంబులు భయంబంది రాముతమ్మునకు దీర్ఘాయు వగుంగాత మని దీవింప జగంబులు తల్లడిల్ల సముద్రంబులు ఘూర్ణిలఁగ లాచలంబులు వడంకఁ జంద్రార్కబింబంబులు దలంక నేగుదెంచి సౌమిత్రి యురంబు నాటి ధాత్రిం బడియె నట్టియవసరమ్మున. 38

సీ. పంక్తికంధరుఁ జేయుబాణంబు లవి లెక్క, సేయక రఘుకులసింహుఁడపుడు
తమ్ముని మెయి నాటి ధరణి గాడినశక్తి, నొగివానరులు తీయనోపకున్న
నవలీల దాని నొయ్యనఁ దీసి పోవైచి, ఘనులైన కపులను గాపుబెట్టి
నేనె రాముఁడ నైతినేని వాజ్జనకుండు, దశరథుండగు నేనిఁ దప్పకుండఁ
గీ. గలన నెదిరించి నానోడఁ గయ్యమునకు, నిలిచె నేనియు దనుజేంద్రు నిజము గాఁగ
నమరు లెఱుఁగంగఁ జంపుదు నతనిచేతఁ, ఒత్తునింతయు కాని నే రత్త వగుడ.
వ. అని మఱియును. 40

క. రాముఁడు రావణుఁ డనుచును, భూమి పయిని నిర్వురునికి బొసఁగదు సుడీ
నామాట వినుఁడు లెస్సఁగ, రాముఁడ నేఁడొండె భువిని రావణుఁ డొండెన్. 41

వ. ఉండుదు మని వీరాలాపంబు లాడుచు రామచంద్రుండు ధనుర్ధరుండై శరవర్షంబులు గురియించిన నసురేశ్వరుండును బ్రతిశరంబుల వాని నన్నింటిసిక్ దూలనేసినఁ గనలి రామచంద్రుండు తొడిగిన యమ్మును వెడలుతూమును విల్లుగుడుసు పడుటయు నెఱుఁగ రానిచందంబునఁ బింజపింజ తఱచిపాఱుచుండునట్లుగాహస్తంబు ముడుచుటయుఁ జాఁచుటయుఁ దెలియరాకుండ రావణుకాలుచేతు లాడకుండ శరలాఘవంబు నెఱపుచు నేయుచున్న యప్పుడు విఱిగి శరీరభూషణంబు లురులఁ గిరీటంబు డుల్లఁ దలలు వీడ మరలి చూచుచు మృగేంద్రుం గన్నగజేంద్రుని చందంబున భీతచేతస్కుండై దశముఖుండు లంకాపురంబుఁ జొచ్చెఁ దదనంతరంబున 42

క. ఆవేళ లావు సూపుచు, రావణుచే శక్తి దాఁకి రణరంగమునన్
జీవ సెడి పడిన లక్ష్మణు, దేవర్ దగ్గఱఁగ రామదేవుఁడు వచ్చెన్. 45

వ. ఇట్లరుగుదెంచి. 46

గీ. రక్తసిక్తాంగుఁడై ధాత్రి శక్తినాటి, యున్నదమ్మునిఁ గనుఁగొని యుస్సురనుచు
దుఃఖ మంతంత నాఁగక తొంగలింపఁ, దొడలపైఁబడి బాష్పముల్ దొప్పఁదోఁగ.

సీ. హా! భానుకులదీప! హా! సత్యసల్లాప!, హా! సుగుణకలాప! హా! సురూప!
హా! ధర్మసంచార! హా! వైరిసంహార!, హా! కీర్తివిస్తార! హా! సుధీర!
హా! నిత్యసుజ్ఞాన! హాపుణ్యసంధాన!, హా! పూజ్యసన్మాన! హా! నిధాన!
హా! శౌర్యగుణవృద్ధ! హా! యుద్ధసన్నద్ధ!, హా! చిత్తసంశుద్ధ! హా! ప్రసిద్ధ!

గీ. హా! మునీశ్వరసంరక్ష! యసురశిక్ష!, హా! గురుస్తోత్రసత్పాత్ర! యబ్జనేత్ర!
హా! సదాచారసంపన్న! హా! ప్రసన్న!, యనుచు శోకాతురాత్ముఁడై యంతకంత

క. జనకుని పంపున నడవికిఁ జనుదెంచియు నిడుమఁ గోర్చి సన్మునివృత్తిన్
ననుఁగూడి నడవ నేర్చిన, యనుజన్మా! యెందుఁబోయి తయ్యో తలఁపన్. 47

క. వనమునఁ గల ఫలమూలము, లనుదినము భక్తియుక్తి నర్పింపుచు మ
జ్జనకుని భంగిని నన్నును, జనకుఁ బోషించి యెందుఁ జనితివి తండ్రీ. 48

క. నీవంటి తోఁడఁబుట్టువు, నీవంటి గుణోత్తరుండు నిజమూహింపన్
భూవలయమందుఁ గలఁడే, భావింపఁగ నీవె తక్కఁ బావనచరితా. 49

క. నెఱయక నిద్రాహారము, లెఱుఁగక పదునాలుగేండ్లు హితమతితో మ
మ్మరిమురి నరసిన నిన్నును, మఱువ నగునె నీతిగల్గు మనుజుల కెందున్. 50

క. నిన్నిచట విడిచి పురికిని, జన్నను నినుఁ గన్నతల్లి సనుదెంచి ననున్
నిన్నడుగఁ దడవ మదిలోఁ, జిన్నంబోవుచును నేమి చెప్పుదుఁ దండ్రీ. 51

వ. అని మఱియును. 52

చ. వినుఁడు కపీంద్రులార పలవింపుచు మజ్జనకుండు నాకమున్
జనియె ధరాతనూభవ నిశాచరుచేఁ జెఱవోయె నేఁటితో
ననుజుఁడు దీఱెనింక నడిమాసల నుండుట నాకు ధర్మమే
చనుఁడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరు గొబ్బునన్. 53

వ. అని విభీషణుం గనుంగొని. 54

ఉ. అక్కట! నీవు నింతఁ గుయ్యట్టి మహాంగవకోటిఁ బాసి నీ
ఇక్కడ కేగుదెంచితి వశీనముదంబున మమ్మునమ్మి పెం
పెక్కఁగ రావణుండు తగ నేలెడిలంకఁ గనుంకనీకు నేఁ
దక్కఁగ నిత్తునన్ ప్రతిన దప్పె విభీషణ నీవు పోవుచూ. 55

వ. అని యనేకప్రకారంబులఁ బ్రలపించుచున్న రామభూపాలునకు సుషేణుండిట్లనియె.

ఉ. దేవ! నీవు నీగతి మదిం దలపోయఁగ నేల తీవ్రమై
రావణు చేతిశక్తి బవరంబున నాటుటఁ జేసి లక్ష్మణుం
డీ విధముండెఁ గాని ధరణీశ్వర చూడుము ముఖార విందమున్
జావదు సావఁ డిరొహ్యద సిఆంబుగ నమ్ము మనంబులోపలన్. 57

ఉ. పున్నమచందురుం దెగడి పొల్పెసలారెడి మోముఁ దమ్మిరుచుఁ
గన్నులు కల్వరేకులును గాంతి జయించెడుఁ గాస్రత్కిమున్
జెన్ను దొలంగియుండ నఱచేతులుఁ బాదములున్ దలంపఁగా
నున్నవి వర్ణముల్ గలిగి యొప్పు తొరంగదు రాఘవేశ్వరా. 58

వ. అని విన్నవించుచు హనుమంతుం గనుంగొని సుషేణుం డిట్లనియె. 59

క. ఈయన ప్రాణము లెత్తగ, వాయుజ యల నాటిమందు వడిఁ దేవలె నీ
వీయెడ నచటికిఁ దడయక, పోయి వెసన్ రమ్ము ప్రొద్దు పొడవక మునుపే 60

వ. అనిన భూకాంతుండు హనుమంతున కిట్లనియె. 61

క. రమ్మా వాయుతనూభవ, యిమ్మహి సత్కీర్తిఁ బడయు మితని ప్రాణం
బిమ్మెగ రక్షింపుము నా, తమ్ములలో నీవు నొక్కతమ్ముఁడ వగుచున్. 62

వ. అని వాయుంజని కౌఁగిటం జేర్చి దీవించి యంపె నప్పుడు. 63

ఆ. పదము లూనఁ ద్రొక్కి వదనంబు దిగఁజూచి, చేతు లూని నడుము చిక్కఁబట్టి
వ్రింగి నిక్కి యెగసి కుప్పించి కడదాఁటి, చనియె గగనవీథి ననిలసుతుఁడు. 64

వ. అట్టి సమయమున. 65

సీ. దనుజేశుఁ డావార్త విని కాలనేమిగే, హము సొచ్చి నడిరేయి యతనితోడఁ
దనచేతహతుఁడైన ధరణీసుతమ్ముని, ప్రాణంబు లెత్తంగఁ బవనసుతుఁడు
చనుచున్న యట్టియాపస ఘన్ను మొనరంప, గ్రక్కున నటఁ బోయి రమ్మటంచుఁ
గాలనేమి యిఁదేటికార్యంబు తగదన్న, వినక కోపించిన వేగ నరిగి

నడరి యద్దానవేంద్రుని కంఠంబున వాలంబుం గీలించి గిరగిరం ద్రిప్పి సముద్రమధ్యం
బునఁ బడవైచిన వాఁడును బాతాళంబునకుం జనియె వాఁడణంబ. 83

గీ. మాల్యవంతునిఁ బోకార్చి మానుషమున, గగనమండల మందంద పగులనార్చి
వచ్చునప్పుడు శతకోటి వాఁడిజాప్త, దీప్తిఁ గనుపట్టెఁ బ్రేచవడన్కనందు. 84

వ. ఇట్లు వెలుంగుచున్న మహౌషధాచలంబు దివ్యదీప్తులు గనుంగొని రాఘవేశ్వరుండది
సూర్యోదయంబని మనంబునఁ దలంకి కపులతోఁ నిట్లనియెఁ 85

చ. అదె కనుఁగొంటిరే కలయనర్కుఁడు పూర్వగిరీంద్రశృంగమం
దుదయముఁ బొందె నింక నిటనుంచినఁ దమ్ముని ప్రాణవాయువుల్
బ్రదుకుట దుర్లభం బకట పల్కుదు మ్రొక్కెదు ప్రొద్ద మాకుఁ దా
నవయత శత్రుఁ డయ్యెఁ గపులార వినుం డిదె మీకుఁ జెప్పెదన్. 86

గీ. మా కులంబున కెల్లను మహిని దలఁపఁ, దానె కర్తయై యుండియు ధర్మమగునె
యుదయమందంగ మనుమఁ డిట్లున్న యెడను, గోసి చుట్టాలుఁ బగవారిఁ గూడవలెనె.

క. ఈలాగునఁ దాఁ బొడిచిన, మా లక్ష్మణుప్రాణ మేలమగుమన్ భానుం
గూలఁగ నేసెద విల్లును, గోలలుఁ దెమ్మనుచు నందికొనునాలోనన్. 88

వ. రామచంద్రునకు జాంబవంతుం డిట్లనియె. 89

ఉ. భానుఁడు గాఁడు చూడు నరపాలక మందులకొండదీప్తి
మానుము దోఁచెఁగాని యనుమానము లేదు వినుండు వేడ్కతో
వానరసేన నింకెదురు వాయుతనూజుని గారవింపఁగా
మానవనాథ పంపుమనుమాత్రనె వచ్చె నతండు తీవ్రతన్.

క. అనిమిషులు సన్నుతింపఁగ, హనుమంతుఁడు ద్రోణశైల మతిశీఘ్రముగాఁ
గొని వచ్చి నిలిచి రఘురా, ముని శ్రీపాదముల కెలమి మ్రొక్కెనయంతన్. 91

వ. రామచంద్రుం డతనిం గౌఁగిలించుకొని సుషేణుం జూచి నీవిందలి దివ్యౌషధంబు
లవలన సౌమిత్రిప్రాణంబులు తేర్చుమనిన నయ్యోషధులనాజ్ఞ శిరంబునఁ దాల్చి వన
చరసహితుండై పర్వతం బెక్కి తొల్లి దేవత లమృతపానంబు చేసిన తావును నారా
యణుండు మోహినీరూపంబున నమృతము పంచునప్పుడు సూర్యచంద్రులనడుమ
నిలిచిన రాహువు శిరంబుఁ ద్రుంచిన తావును బలిచక్రవర్తి యాగంబు సేసిన తావును
రాక్షసులు జన్మించిన తావును శంకరభగవానుండు పర్వతరాజకూఁతును బెండ్లియా
డిన తావు వానరులకుం జూపుచు నగ్గిరీంద్రంబుపైనున్న యోషధంబులు గొని

వచ్చి ప్రయోగింప నాయౌషధముల సామర్థ్యంబునంజేసి లక్ష్మణునకుఁ బ్రాణంబులు మగుడవచ్చె నంత సకలవానరులు నానందరసాబ్ధిం దేలి రప్పుడు సౌమిత్రి రామునకు నమస్కరించిన రామచంద్రుండు కౌఁగిటం జేర్చి హనుమంతుం డొనరించిన యుపకృతికి సంతోషించి యాపర్వతంబును దొల్లింటియునికినే యుంచి రమ్మనిన నతం డట్ల కావించెనని నారదుండు సెప్పిన వాల్మీకిమునీశ్వరుం డటమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు. 92

క. జలజాక్ష! భక్తవత్సల!, జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!, జలజాకరచారుహంస! జానకినాథా!. 93

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురులింగజంగమార్చన వినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు యుద్ధకాండమునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ వేదము ... కృష్ణ ...



శ్రీరస్తు

# మొల్లరామాయణము





## యుద్ధకాండము. తృతీయాశ్వాసము.



మలసుధాకరవదనా!

సుమనస్స్తుత్యాబ్జపదన! సుస్థిరకదనా?

కమనీయరదన! శత్రువి

షమ! రఘుకులసార్వభౌమ! జానకిరామా!

వ. శ్రీనారదమునీంద్రుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగెఱింగించెద నాకర్ణింపుము. 2

క. కలకల పక్షులు మ్రోయఁగ, వెలవెలనై తారకములు పడమటఁ దొలఁగన్
జలజములు విరియఁ దూర్పున, బలబలనై తెల్లవాఱె భానుఁడు పొడమెన్. 3

సీ. అట మున్న దశకంఠుఁ డాచార్యుఁ డైనట్టి, శుక్రానుమతి దేహశుద్ధితోడ
రణజయార్థంబుగా రథములు గుఱ్ఱముల్, కవచంబు లస్త్రసంఘములు గలుగఁ
బాతాళగుహఁ జొచ్చి వీతిహోత్రునిఁ గూర్చి, హోయక హోమంబు సేయుచుండ
నాహోమధూమంబు లాకసంబునఁ బర్వఁ, గని విభీషణుఁడు భూకాంతునకును
గీ. విన్నవించెను. మాయన్న విన్న నరిగి, హోమ మొనరింపుచున్నవాఁ డుడుగ కిపుడు
మొనసి యాహోమ మది తుద ముట్టెనేనిఁ, గలన బ్రహ్మకు నాతని గెలువలేము. 4

క. ఈపనివిఘ్నము సేయఁగ, భూపాలక కపుల నేర్చిపుచ్చుము లేదే
మీపని విఘ్నమగు ననుఁడు, భూపాలవరేణ్యుఁ డపుడు భూధరచరులన్. 5

చ. గవయ గవాక్ష వాలిసుత కంజహితాత్మజ నీల వాయుసం
భవ నల గంధమాదన విభీషణ భల్లుకనాథముఖ్యులన్
దివిజవిరోధిపైఁ బనుపఁ దీవ్రత నేగి పురంబు సొచ్చి దా

రామునిచేతఁ జచ్చిన స్థిరం బగు మోక్షము గల్గు నిక్కమై
యేమిటి కింత దైన్య మిసి! యిచ్చఁ దలంపుము రాక్షసేశ్వరా! 15

వ. అని యనేకవిధంబులుగా దీనాలాపంబు లాడుచు వెక్కి వెక్కి యేడ్వం గని లజ్జించి మహోగ్రాకారుండై లేచి దగ్ధశేషకాండంబులచే వానరవీరులకరంబులు శిరంబులు ముక్కులుఁ జెవులు నలుగ మొత్తినం బఱచి వారు రామచంద్రుని సమ్ముఖంబునకుం బోయి తామటపోయి వచ్చిన పని విన్నవించి రట్టిసమయంబున. 16

గీ. నగచరులఁ దోలి క్రమ్మర నగరి, కరిగి కింకనుండ హర్మ్యంబు పొదుకొన్న
విన్నఁదనమున వగపునఁ జిన్నవోయి చెంత నున్నట్టిజనముల కాంతఁ జూచి. 17

క. నాకేలు వట్టి వెంసిన, నీ కేలా చిన్నవోవ నీరజయనా
నాకులు బెదరఁగ నల, యిక్ష్వాకుకులోద్భవుల గెలిచి వచ్చెద నింకన్. 18

గీ. తెలియ మయపుత్త్రి నాదుప్రతిజ్ఞ వినుము, వనచరులతోడ రామభూవరుని నేఁడు
చంపుటొండెను వానిచేఁ జచ్చుటొండె, గాని యూరక మఱలుట కానిమాట.

వ. అని వీరరసం బుప్పొంగఁ బ్రతిజ్ఞాలాపంబులఁ దనపట్టపుదేవియగు మండోదరి నోదార్చి కొలువుకూటంబున కేతెంచి యచ్చట. 20

క. శిరముల వీనుల గళములఁ, గరముల నురమున నడుమునఁ గమనీయతరాం
బురుహముల భూషణావళు, లరుదారఁగ దాల్చి మోహనాకృతి మీఱన్. 21

గీ. గంధమాల్యాంబరాదులు బంధురముగ, మేనఁ గలయంగ ధరియించి దానవేంద్రుఁ
డంత రణభేరి వేయించి పంత మరల, బిరుగురాహుత్తువీరులఁ బిలువ బనిచె. 22

23

వ. అట్టియవసరంబున.

ఆ. రోష మడర ఖడ్గరోముండు వృశ్చిక, రోముఁ డల్లసర్పరోముఁ డగ్ని
వర్ణుఁడాది గాఁగ వచ్చిరి రాక్షసవీరు లపుడు దనుజవిభుని గొలువ 24

క. ఇరువదిచేతుల శస్త్రా, స్త్రములు మెఱయంగఁ దాల్చి కౌతుక మడరన్
దురగములు నూఱు గట్టిన, యరదముపైఁ గూరుచుండి యతివిభవమునన్, 25

సీ. భేరులు తమ్మటల్ వెల్లురిస్సాణముల్, బూరగొమ్ములు కంచువీణములు
మకిలక్రోవులు వీరమద్దెలల్ గిడుగిళ్లు, పేరైనతప్పెటల్ ఢిల్లఁగ్రోళ్ళు
తారలు చిమ్మటతారలు శంఖముల్, కాహళుల్ పసిఁడిఢక్కలును బిసులు
గాలికొమ్ములు డోళ్ళు కైవస్త్రరుంజలు. ఛత్త్రసంఘంబులు చామరములు

గీ. భోరుకలఁగఁగ దిక్కులు బూరటిల్ల, దనుజవర్గంబు లిరువంకఁ దవిలికొలువ
వెడలె సన్నాహ మడరంగ వీరరసము, కుప్పగట్టినచందంబు గానఁబడఁగ. 26

క. కాలాగ్ని కాలభైరవ, కాలాంతక కాలదండ కాలాహికళా

వేలుచు సంగడుం దశని ద్రోని పూని శరంబు చెక్కటై
ద్రిప్పడంగఁ గొట్ట బృహస్పతిం గూలెను సర్పరోముండున్. 41

క. ఆంగావ సర్పరోముండును, గాలుట కనుంగొనుచు నిగుడం గోపంబున దా
నాలో వృశ్చికరోముండు, నీలునిపై రథముం దోలె నిర్భయుండై. 42

ఉ. బోరన నీలుం డంత నొకభూజము గైకొని వానితేరిపై
గూరత వేసి యాక్షణము మార్గముగా నొనరింప నేలకున్
ధీరత దాటి భూరుహముం ద్రుంపం గనుంగొని నీలుం, డొక్కమం
దారమహీజముం వయిచె ధారుణి వృశ్చికరోముం డీలగన్. 43

సీ. వృశ్చికరోముం డావేళం ద్రుంగుటం జేసి, వడి రోషమున నగ్నివర్ణుం డనెడి
ద్రేతాగ్ని తోక్కటై వెనరి మండినలీలం, దనమేనివుంటులు దరికొనంగ
రావణునెమరం బరాక్రమస్థితిం జేర్చి, రామచంద్రునిమీంద రథముదోలి
ప్రల్లదంబునం జెక్కుభాషలు నుడువుచు, సాయకనిచయంబు లేయంనెడను

గీ. వానిశౌర్యంబుం దెంపును వానిబలముం, జూచి భూపాలుం డప్పుడు చోద్యపడుచు
ధనువునందును వారుణాస్త్రంబు దొడిగి, యగ్నివర్ణునితలం ద్రుంచె నాక్షణంబ. 43

గీ. అగ్నివర్ణుడు తెగిపోవు టసురవరుండు, గన్నులారంగం గనుంగొని కలుషవృత్తి
రామచంద్రుని డాయంగ రథముం బఱిపి, పలికె నుత్కటగర్వప్రభావుం డగుచు 44

ద. జాఱకుమీ ప్రకము చెడి, పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనముల్
దూఱకుమా వేరొక్కంచును, జీరకుమా కపులం దోడు చేకొని పోరన్. 45

మ. అని నిక్కిడి దైత్యనాయకుండు రోషాయత్తచిత్తమ్మునన్
ఘనమౌర్వీనినదంబు భీకరముగాం గావించి పెల్లార్చి య
జ్జననాథాగ్రణిమీంద నుగ్రశరముల్ సంధించి బిట్టేయంగా
వినువీథిన్ సురసంఘముల్ గొలువంగా వీక్షించె దేవేంద్రుండున్. 46

వ. ఇట్లు కనుంగొని. 47

క. రథ మెక్కి రావణుండును, బృథ్వీస్థలి నుండి రామపృథ్వీపతియున్
బ్రధనము సేయుట తగ దని, వ్యథ పొందుచు నాత్మలోన వాసవుం డంతన్. 48

క. మాతలిచేతను గవచము, చాతుర్యము గలుగురథము చాపము శరమున్
భూతలనాయకునకుం బుర, హూతుండు పుత్తెంచెంగడు మహోన్నతమహిమన్. 49

వ. ఇట్లు పుత్తెంచిన. 50

ఉ. ధరణికి వచ్చి మాతలి ముదంబున రాముని జూచి యీతఁ గా
సురపతి పంపినాఁ డధికశోభనకృత్యములై వెలుంగు నీ
శరములు విల్లు వజ్రకవచంబును దేరును వీరి చేత సం
గరమున దైత్యునిం దునిమి కైకొనుమా రఘువ శ్రీజయంబులన్. 51

వ. అని చెప్పిన మాతలి ప్రియవచనంబులకు సంతసించి విభీషణానుమతంబున నమ్మహీపాలుండు వజ్రకవచంబు దొడిగి శరశరాసనంబులు గైకొని యింద్రస్యందనంబునకు వలగొని వందనం బాచరించి బాలాదిత్యుండు పూర్వపర్వతం బెక్కు చందంబున రథం బెక్కి నంత జయజయధ్వనులతో సుగ్రీవాంగద హనుమదాదులైన వానరవీరులు మ్రొక్కి రప్పుడంతరిక్షంబున దేవసంఘంబులు సంగ్రామరంగంబుఁ జూడ వేడ్క పడి వచ్చినవిమానంబులఁ గ్రిక్కిరిసియుండె నాసమయంబున. 52

క. గిరి గిరి నభము నభంబును, ధర ధరయును జలధి జలధి దాఁకినరీతిన్
సురరిపుఁడు నసురరిపుఁడును, దురమున దాఁకొంచి రధికదోర్బలయుక్తిన్. 53

వ. ఇట్లు మార్కొనుచు. 54

శా. వీరాలాపము లాడుచుం గదిసి దోర్వీర్యంబులోరన్ ధను
ర్జ్యారావంబులు మిన్ను ముట్ట నతితీవ్రం బైనశబ్దంబులన్
వారాసుల్ కలఁగంగ సార్చి నిజగర్వస్ఫూర్తి నప్పొంగుచున్
ఘోరాస్త్రంబుల నేసి రొండొరులపైఁ గోదండపాండిత్యులై. 55

క. దనుజేశుఁ డేయుశరములు, మనుజేశుఁడు తప్ప ద్రుంచు మార్కొని కడిమిన్
మనుజేశుఁ డేయుశరముల, దనుజేశుఁడు దప్పఁ ద్రుంచుఁ దతభుజశక్తిన్. 56

క. కంటున నేసినశరములు, వింటన్ దప్పించుకొనుచు వెసబాణములన్
గెంటింపుచుఁ దమగాత్రము, లంటక యుండంగ నేటు లాడిరి కడిమిన్. 58

క. మొదల నొకబాణ మావల, బదులును బదిపదులు వేగఁ బదివేలును నేఁ
బదివేలు లక్ష కోటియుఁ, జెదరక విలుకాండ్రమీఁద జెఱ్ఱుము పర్వెన్. 57

క. తొడిగినబాణము వింటను, దొడిగినయట్లుండు మిగులఁ దొడ్తో నవుడున్
వెడలెడుశరములు లెక్కకు, గడగుఁడు తనరాక చిత్రగతులన్ బర్వెన్. 59

వ. అట్టి సమయంబున.

చ. అభవము రాంత కాదులు మహాత్ములు వింటికి వారె కన్నను
త్రిభువనమందు వీరె గణుతింపఁగ నెక్కుడటంచు మెచ్చుచున్

ఆ. అంత రామచంద్రుఁ డత్యంతకుపితుఁడై, బాణవృష్టిఁ గురియఁ బఙ్క్తిముఖుఁడు
కాలు వ్రేలు చెయ్యి కదలింప నోపక, మొగల లేక రథముమీఁద నొరఁగె. 72

వ. రావణుండు సొమ్మసిల్లిపోవు టెఱిఁగి కాలకేతుండను తేరు దూరంబుగాఁ గొనిపో యినఁ గొంతప్రొద్దునకు దనుజేంద్రుండు మూర్ఛదేఱి సూతుఁ జూచి పగవారలు నవ్వఁదగ వనక రథంబిట్లు తేఁదగునే యని కోపించినఁ గాలకేతుండును యుద్ధమార్గంబునఁ జేరి సంకటంబైన రణంబువెడలఁ గొనిపోవుట యోటమిగాదని ధర్మవిదులు సెప్పుదురు గావున నేనిట్లు దెచ్చితినని విన్నవించిన సూతుని వాక్యంబులకు మెచ్చి పసదనంబు లిచ్చి మన రథంబు రాముకడకుం బఱపు మనిన నట్లు గావించెన్ గనుంగొని. 73

క. ఆతని రథమున కెదురుగ మాతలి! మన రథముఁ బఱపుమా యన నతఁడున్
వే తీవ్రగతిం బఱపిన, భూతలపతి పలికె దనుజపుంగవుతోడన్. 74

ఉ. భూమిభుజప్రతాపమునఁ బొంగుచు నిర్జరకోటి మాటికిన్
బోర జయించితంచుఁ బలుపోకలు పోదువు నీవు ధీరతన్ మై
దాకక నిల్చి నాయెడఁ బ్రతాపము సూపుము సూపవేని నా
వారిజగర్భుఁ డడ్డుపడవచ్చినఁ జంపుదు నిన్ను రావణా. 75

ఉ. ఆలములోన వానరుల నాలము సేసినయట్లు గాదు నా
వాఁడిశరంబు నీ మకుటవ్రాతము లాఁగఁగ బాలుఁ డడ్డగీ
వేళ వృథా పరిహాస్యములు వేయువిధంబుల మానలేక తాఁ
గాలుఁడు కన్నుఁ గీటె నిదె కాలము దగ్గఱె నీకు రావణా. 76

చ. హరి గిరి వహ్ని గిహ్ని ప్రళయాంతకుఁ గింకరు దైత్యు గిత్యు వా
ర్వరు గిరు గాండ్ర ధనవల్లభు గిల్లభు రుద్రు గిద్రు సం
గరమున నోర్చినట్టి దశకంధర నీకు జయింప వచ్చునే
సురనగధీరు నుగ్రరణశూరుఁ బయోధిగభీరు రాఘవున్. 77

క. మఱిఁ దలఁప సుఖరతిం బతి వ్రతలను మునివరులఁ బట్టి వ్రతములు గర్వో
న్నతిఁ జెఱచినట్టి మాత్ర, స్థితి నిప్పుడు నీవు నాకుఁ జిక్కితి విచటన్. 78

వ. అని గర్వాలాపంబులాడుచున్న యుర్వీశునకుం బూర్వగీర్వాణాధీశ్వరుం డగు రావణాసురుం డిట్లనియె. 79

వ. అంత దైత్యేంద్రుండు తన మనంబున. 101

క. ఎవ్వరు నెఱుఁగనిమర్మం, బివ్విభునకు నెఱుకపఱుప నిటుగావించెన్
మవ్వమున నీవిభీషణు, క్రొవ్వెల్లనడంతు నంచుఁ గ్రూరతతోడన్. 102

సీ. తొల్లిపరమాప్తి దొరికినయటువంటి, రక్తాభ మనుమహాశక్తిదివిచి
గంధపుష్పాక్షతకలితమై కనుపట్టి, విపులతేజంబున వెలయుచున్న .
దానిఁ బ్రయోగింప దారుణానలతీవ్ర, శిఖలు దిక్తటములఁ జెలఁగుచుండ
ఘనఘనారావమై ఘంటానినాదంబు,శ్రుతిపుటంబులకు నస్రుతముగాఁగఁ

గీ. చండతరముగ నట విభీషణునిపైకిఁ, జిచ్చు లుమియుచు నుగ్రమై వచ్చు దానిఁ
గాంచి రాముండు వింతమార్గణము చేతఁ, దృణము కైవడి నడిమికిఁ దెంచివైచె. 103

వ. ఇట్లు తనశక్తి వృథ యగుట గని దానవేంద్రుండు మానవేంద్రునిపైఁ గరంబలిగి
నిట్టూర్పునిగుడింపుచు నసిముసలముద్గరపరశుపట్టిసప్రాసగదాపండకోదండ భిండివా
లాదిసాధనంబుల నవక్రవిక్రమంబున లావంబు సేయుచుండఁగని విభీషణుండు హరికి
దేవా! వీఁడు రెండుకరంబులతోడనే మొండుగయుద్ధంబు సేయదొడంగె నింక
శిరంబులుఁ గరంబులు మరల నుద్భవించె నేనిఁ గార్యంబుదప్పుటకు సందియంబు
లేదు గావున వీని నీలోనన బ్రహ్మాస్త్రంబున నడఁగింపఁదగునని విన్నవించిన. 104

మ. అనఘుండుజ్జ్వలచాపదండమున బ్రహ్మాస్త్రంబు సంధించి యొ
య్యనఁ గర్ణాంతముగాఁ గడున్ దివిచి ప్రత్యాలీఢపాదస్థుఁడై
దనుజాధీశ్వరు బాహుమధ్యము వడిం దాఁకంగ లక్ష్యంబుగాఁ
గొనిబిట్టేసె నదల్చి తీవ్రతరనూకోపంబు దీపింపఁగన్. 105

క. ఆవేటు వడిఁగ నాటిన, రావణుఁ డతివివశుఁడగుచు వ్రాలె ధరిత్రిన్
దేవతలు పొగడి యప్పుడు, పూవులవర్షంబు గురిసె భూవరుమీఁదన్. 106

ఉ. సంగరభూమి రావణుని సత్త్వము దూలి ధరిత్రిఁ గూలినన్
గ్రుంగె భరంబునన్ ధరణి క్రుంగెఁ గులాచలవర్గ మెల్ల వే
క్రుంగె దిశాకరీంద్రములు క్రుంగె మహోరగవంశనాథుఁడున్
గ్రుంగె ఫణీశులేశ్వరుఁడు క్రుంగె వరాహముగ్రుడ్డు తేలఁగన్.

క. జగములకు నెల్ల బాధకుఁ, డగు రావణుఁ డాజిఁ గూల సంతటితోడన్
బగ దీఱె ననుచు రాముఁడు, తగఁ దన విల్లెక్కు డించి తమ్మునికిచ్చెన్ 108

సీ. అఖిలలోకమ్ముల కానంద మొదవెను, సురలకంటికి నిద్ర సోఁకె నంత

మునులు చేసినతపంబులు చాల ఫలియించెఁ, దొడరి సాధ్యులకుఁ దుందుడుకువాసె
గుహ్యకావళికిఁ గూడు నోటికిఁ బోయెఁ, సిద్ధులతలఁపులు సిద్ధి నొందె
దర్వీకరంబుల తల్లడం బడఁగెను, గిన్నర సంఘంబుకీడు తొలఁగె

గీ. గరుడగంధర్వఖేచరగణములకును, క్షేమ మింపారె జనపరిణామ మయ్యె
వేడ్క లింపొంద బాధలు విఱుగ దయ్యె, ననపహినామమయ్యె

ఉ. అంత విభీషణుండు తనయన్న పదంబులమీఁద వ్రాలి య
త్యంతవిషాదదుఃఖజనితాశ్రుకణంబులు రాల నేడ్చెలో
కాంతకుఁ డైనరావణుమహోద్భటదుష్టపరాక్రమంబు భూ
కాంతునిమంగళం దడవి గద్గదకంఠకషాయనేత్రుఁడై. 110

వ. అట్టి సమయంబున మందోదరి మొదలైన యంతఃపురసుందరీ సందోహంబు లేతెంచి
తమ ప్రాణేశ్వరుం డైనరాక్షసకులసార్వభౌముం గని వక్షంబులు శిరంబులు మోఁదు
కొనుచు బహువిధంబులఁ బ్రలాపింపుచుఁ బరివేష్టించుకొని యుండ భూకాంతుండు
శాంతాలాపంబుల ననునయించి విభీషణుం గని నీవు దుఃఖంబుడిగి మీయన్నకు నగ్ని
సంస్కారాదివిధుల నాచరింపుమనిన నతం డట్ల కావించి యనంతరంబ విభీషణుని
లంకానగరంబునకు బట్టంబు గట్టించిన నతండు సుగంధద్రవ్యంబులును నవరత్నఖచి
తంబులైన భూషణంబులును జీనిచీనాంబరంబులును గానుకగా నిచ్చినం బరిగ్ర
హించి యవి యెల్లను మాతలి కిచ్చి ప్రియోక్తులం దనిపి యనిపిన నతండును స్వర్గంబు
నకుం జనియె నయ్యవసరంబున. 111

సీ. వేలోన రాసుతుం డావిభీషణుఁ జూచి, సత్కీర్తియుఁ దత్త్వమై సరగఁ బిలిచి
పంక్తిరథుని నాజిఁ బరిమార్చితి ననుచు, వసుమతీతనయకు వార్త సెప్పి
నీజేవి మొదలగు నీరజాక్షుల చేత, నతివకు శృంగార మమరఁ జేసి
కొంచు రమ్మని చెప్ప నంచితగతి నేగి, సరమాదిసతుల కా రణిఁ జెప్ప

గీ. సతులు నిర్మలజలముల జలక మార్చి, పట్టు పుట్టంబు ముదమునఁ గట్టఁ బెట్టి
చందన మలంది సురభిపుష్పములు ముడిచి, మేలిమణిభూషణంబులు సొలఁ దొడిగి

క. ఇందిరతో సరి యగునా, సుందరిఁ బ్రియసఖ్యమాత సొబ గొందఁగఁ దొ
రందలమునఁ గొని వచ్చిరి, కందర్పభుండు రాముకడకుం బ్రీతిన్ 113

వ. ఇట్లు గొనివచ్చి రామభూపాలుని సమ్ముఖంబున నునిచిన నద్ధరాతనూజాత పతికి
వినయభక్తి తాత్పర్యంబులు వెలయఁ బ్రణమిల్లిన నతండు వనితారత్నంబగు సీతం
గనుంగొని యిట్లనియె. 114

క. కులసతిఁ జెఱ గొనిపోయిన, యలశాత్రవు గెలువ నోపఁ దనుపలుకులకున్
గెలిచితిఁ దగ దండించితి నిఁక, నెలతా నీయిచ్చఁ జనుము నే నిన్నొల్లన్ 115

గీ. అనుచుఁ బలుకుపలుకు లవనీతనూజాత, కర్ణములకు వాఁడి గలుగునట్టి
నారసములు సోఁకి నాటిన యట్లైన, సరసిజాక్షి మూర్ఛఁ జాల నొంది. 116

ఉ. నరవర నాదుచిత్తము మనంబున నీవ యెఱింగియుండియున్
బరుషము లాడ నేమిటికిఁ బాపము నాయెడ లేదు కాదు పో
సురలు నుతింప మేటిసావఁ జొచ్చెద మెచ్చుఁడటన్న రామభూ
వరునిమనం బొడంబడిన వారిజలోచన సీత యాతఱిన్. 116

క! హృదయేశుఁ డురక నవ్వఁడ, పొదఁ జొచ్చెను భూమిపుత్రి సురలు నుతింపన్
ముద మంది వహ్ని నవ్వఁడ, యదనం బ్రత్యక్షమయ్యెనాగ్ని యనుచున్. 118

గీ. అంతఁ బద్మగర్భుఁ డవనీశుఁ డగురామ, భద్రుఁ జూచి పలికెఁ బరమపురుష
వనజనేత్ర సీతవలన దోసము లేదు, నమ్ము వసుమతీశ నాదుమాట. 119

వ. అని పలికిన పితామహునిమాటల నుభయసేనలును సంతసిల్లినవి. అనంతరమగ్నిభగ
వానుండు నయ్యంగనం గొనివచ్చి పరమపతివ్రతాభరణం బగు నిద్ధరాతనూజాతం
గైకొమ్మని యప్పగించిన నయ్యెడ దశరథునకు ప్రియసుతుండైన శ్రీరామచంద్రుండు
సతీసమేతుండై తమ్ముండును దానును నమస్కరించినఁ గుమారద్వయంబును గౌఁగ
లిని నాలింగనంబుచేసి తద్దుఃఖంబులం బాపి చనియె నప్పుడు సకలదేవతలు నిట్లనిరి.

క. మాకోరికఁ జనన మొందితి, రాకాసులరాజుఁ జంపి రక్షించితి నా
లోకంబు లెల్లఁ గృపతో, సాకేతపురాధినాథ ! సజ్జనవినుతా. 121

క. అని వినుతి సేసి కలనన్, జనిపోయినకపుల నెల్ల సత్కృప బ్రదుకం
డని వరము లిచ్చి యరిగిరి, ఘను లాదేవతలు మరలి గగనంబునకున్. 122

వ. తదనంతరంబున. 123

గీ. భానుపుత్రాదివానర బలముతోడ, ఘనవిభీషణముఖ్య రాక్షసులతోడ
మఱియును జానకితోడ లక్ష్మణునితోడఁ బుష్పకం బెక్కిచనియె నాభూమివిభుండు.

వ. ఇట్లు పుష్పకారూఢుండై చనుచుండి రామభూకాంతుండు తన కాంతారత్నంబు
నకుఁ జేయెత్తి చూపుచు సంగ్రామస్థలం బిదే రావణకుంభకర్ణాదులైన రాక్షసబలం
బును మర్దించినతా విదే సువేలాచలం బిదే సముద్రంబునకున్ బంధించిన సేతుబంధనం
బిదే విభీషణుండు మమ్ము శరణు చొచ్చినప్రదేశం బిదే కిష్కింధానగరసుగ్రీవుని

రంబిదె వాలిని నేలఁగూలనేసిన చోటిదె భానునందనుండు మమ్ములఁ బొడగన్న స్థలం బిదె ఋశ్యమూకాచలం బిదె వాయుతనూభవుండు మమ్ముఁ బొడగన్న తావిదె పంపాసరోవరంబు నిదె కబంధుఁడను దానవుని వధించిన ప్రదేశం బిదె జటాయువను పక్షీంద్రుండు నిన్నుఁ గొనిపోవునప్పుడు రావణాసురునితోడం బోరి మడిసినస్థానం బిదె. జనస్థానం బిదె దశవదనుండు నిన్నుఁ జెఱగొనిపోయినచోటిదె మాయామృగంబును బడనేసినచోటిదె ఖరదూషణాదులు నాతోడఁబోరి పొలసిన తావిదె శూర్పణఖ యనుదానిముక్కు చెవులుం జెక్కిన యిక్కయిదె సుతీక్ష్ణుం డను మునీంద్రుండు వర్తించు నాశ్రమం బిదె యగస్త్యాశ్రమం బిదె యత్రిమహామునీంద్రునిపత్ని యనసూయదేవి యంగరాగంబులు నీకిచ్చిన చక్కియిదె విరాధుం డను రాక్షసుండు నిన్నుఁ బట్టికొనిపోవుచుండ వధించినచోటిదె చిత్రకూటాచలంబిదె భరతుఁడు మనల నొడంబఱిచి మరలం గొనిపోవ వచ్చినచోటిదె గంగానది యల్లదే కనుంగొనుమని చెప్పుచు భరద్వాజాశ్రమంబుఁ జేరం జని యచ్చటఁ బుష్పకంబుఁ డిగ్గి యమ్మునీంద్రునకు నమస్కరించిన నతండు రాముని దీవించి మహానందంబు నొంది యనిలసంభవా! వేవేగ నీవేగి నందిగ్రామమ్మున నున్న భరతునకు మారాక యెఱింగించి రమ్మని యనిన. 125

క. అరుదెంచి చూచెఁ బావని, సురుచిరసౌభాగ్యభరతు శోభనచరితున్
విరచితపుణ్యస్ఫురితున్, నిరుపమసత్కీర్తి నిత్యనిరతున్ భరతున్. 126

వ. కనుంగొని వందనంబు సేసి కరంబులు మోడ్చి వినయంబున. 127

ఆ. భరతునకును రామభద్రుఁ డేతెంచినఁ వార్తఁ జెప్ప వినుచు వాయుసుతుని
గారవించి నిండ కౌఁగిటఁ జేర్చుచు, నగ్రజన్ము సేమ మడిగి యడిగె. 128

క. తల్లులు మువ్వురకును రఘు, వల్లభుఁ డేతెంచునట్టి వార్తను దెలుపన్
బల్లిదుఁ డగుతనతమ్ముని, నల్లన సాకేతపురికి ననిపెన్ వేడ్కన్. 129

వ. అట భరద్వాజాశ్రమంబున మజ్జనభోజనాదు లారగించి నాఁటిరాత్రి నిలిచి మఱునాఁ డమ్మునీంద్రుని వీడ్కొని శ్రీరామచంద్రుండు పుష్పకారూఢుండై చనుదెంచుచున్న యప్పుడన్నను భరతుండు సలసేనాసమేతుండై తల్లులుం దమ్మునును నెదురేగి రాఘవేశ్వరుపాదారవిందంబులకు వందనంబాచరించిన నతం డనుజన్ములఁ గౌఁగిలించికొని లక్ష్మణసహితుండై జనకరాజనందనం గూడి తల్లులుముప్వురకును బ్రణమిల్లి వారలతిస్నేహంబున నింపుఁ గౌఁగిళ్ళొత్తుచు దీవింపఁ దమలోఁ దాము

పెద్దపిన్నంతసూనువుల వందనంబులు సేసికొని మరల నందిగ్రామంబునకేగి యచ్చట పుష్పకంబు డిగ్గి దాని కర్పణలిచ్చి కుబేరునివీటికి బొమ్మనియనిపి భరతుమందిరంబు ప్రవేశించె నట్టి శుభసమయమున. 130

క. దానంబు లిచ్చి భద్ర, స్నానంబు సేసి భూషణంబులు పూఁతల్
చీనాంబరములుఁ బరిమళ, సూనంబులుఁ దాల్చి రథికశోభనలీలన్. 131

వ. ఇట్లు రామాదిసోదర చతుష్టయంబును భూమినందనయును దపోవేషంబు లుజ్జగించి రాజచిహ్నంబులు గైకొని దానవవానరబలంబులం గూడుకొని షడ్రసోపేతంబు లైన భోజనంబులం బరితృప్తులై యారాత్రి గడపి మఱునాఁడు గజతురగస్యందనాదివాహనంబులెక్కి ఛత్రచామరాదులు మెఱయ శంఖభేరీభాంకారంబు లుల్లసిల్ల వందిమాగధుల బిరుదుకైవారంబులు సెలఁగ నయోధ్యాపురంబుఁ బ్రవేశించి నగరులోనికి సొత్తెంచి వసిష్ఠానుమతంబున శుభముహూర్తంబున భద్రసింహాసనంబునఁ బట్టభద్రుండై రామభద్రుండు భూసురులకు దానంబులొసంగి యర్థార్థుల కిష్టార్థంబులిచ్చి విభీషణసుగ్రీవాంగదజాంబవద్ధనుమదాదులఁ బ్రియవచనంబులం దనిపి వారి వారికిం దగినపగిదిని గట్నంబులిచ్చి వీడ్కొలిపిన వారు నిజస్థానంబులకుం జని రంత మహానందమున. 132

ఆ. అశ్వమేధయాగ మని నొస్వజన్నంబు, చెలిమిఁ జేసి దివిజు లెల్లమెచ్చ
లీలఁ బదునొకండువేలేండ్లు ధరయేలెఁ, బరమధర్మమహిమఁ బ్రజలు వొగడ 133

సీ. సకలౌషధక్రియాసంజీవకరణిచేఁ, జెలఁగి దిక్కులను రక్షింపఁజాలు
బంధురోన్నతశస్త్రసంధానకరణిచేఁ, గుటిలారులను రంభఁ గూర్పఁజాలు
సంతతోత్పాదన సౌవర్ణకరణిచే, నర్థుల దారిద్ర్య మడఁపఁజాలు
ననుదినసంధాన మనుశల్యకరణిచేఁ, బురుషార్థనికరంబుఁ బ్రోవఁజాలు

గీ. సిద్ధవిద్యానురాగప్రసిద్ధుఁడైన, రాజచంద్రుం డితం డని రాజు లెల్ల
సన్నుతింపఁగ విలసిల్లె జగతియందు, భాగ్యవిస్తారి రామభూపాలశౌరి. 134

సీ. కుటిలత నదులందుఁ గుంతలంబులయందు, బొంకు జూదములందు బూతులందు
లేమి వైరులయందు లేమలనడుమందు, భంగ మంబుధులందుఁ బరులయందు
కోపంబుఖలులందుఁ గ్రూరవర్తనులందు, వడఁకు వీణలయందు వ్యసనులందు
బంధంబు రతులయందుఁ బటుశిరోజములందు, మోహంబు ఘనమందు ముదితలందు

గీ. జింత కవులందుఁ దపసుల చిత్తమందు, వర్ణమిళితంబు చిత్తరువందు యవను
లందునసె కాసియుండెడుఁ జెందకుండ, లీల ధరయేలె రామభూపాలవరుఁడు. 135

క. ఈరామచరిత మెప్పుడు, వారక విన్నట్టివారు వ్రాసినవారున్
గోరి పఠించినవారును, శ్రీరామునికరుణ మేలు సెందుదు రెలఘిన్.

క. జలజాక్ష! భక్తవత్సల!, జలజాసననినుత పాదజలజాత! సుధా
జలశాశభవ్యమందిర!, జలజాకరచారుహంస! జానకినాథా! 137

మాలిని కువలయదళనేత్రా! కోమలస్నిగ్ధగాత్రా!
భవముఖనుతిస్తోత్రా! భక్తవృక్షైకచైత్రా!
రవిశతసమధామా! రక్షితాశాంఘ్రిభామా!
కవిజననుతనామా కావుమా మమ్ము రామా. 13

గద్యము. శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చన వినోద
నిత్యశైవాచారసంపన్న సూరిజనవినుతాతుకూరి కేసనశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు యుద్ధకాండమున
సర్వమును దృతీయాశ్వాసము.





దేశబంధుముద్రాక్షరశాల, రాజమండ్రి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B127 |
| పుస్తకం పేరు | మొల్లరామాయణము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1to9 |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | ROHITH |
| పరీక్ష చేసినది | |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |